# రాగద్వేషాలు

వల్లనాధ్

అన్నపూర్ణా పబ్లిషర్సు
ఏలూరురోడ్డు : విజయవాడ 2.

# 1

"ఇదేనా రావటం బాబూ!" అడిగాడు వెంకయ్య.

"అవును మావా! ఇదే రావడం!" అన్నాడు రామారావు.

రెండేళ్ళకి ఆ వూళ్ళో అడుగు పెడుతున్న రామారావుకి మొదటగా కనిపించింది వెంకయ్య.

"కబురంపితే పాలేరు వచ్చేవాడుగా!" అన్నాడు వెంకయ్య రామారావు చేతిలోని సూటుకేసుని చూచి.

"ఆఁ ఏమంత బరువులేదు!" అంటూ రామారావు ఓసారి దానివంక చూచాడు. తన మాటను తానే నమ్మలేని అయోమయ స్థితిలో. సూటుకేసు బరువుగానే వుంది. పల్లెటూళ్ళో కాలం గడవదని అతనికి తెలుసు. తన జీతగాళ్ళందరూ పొట్టకోసం ఊరు వదిలిపోయిన సంగతి అతనికి తెలుసు.

అందువల్ల ఏవో కొన్ని పుస్తకాలు ఎన్నుకొని వాటిని సూటు కేసులోనే సర్దాడు.

"ఎందాకా బయలుదేరావు?" రామారావు అడిగాడు. సంభాషణని మార్చటానికి మరో మార్గం లేక.

"కొంచెం పనిమీద వెళుతున్నాను." అంటూనే వెంకయ్య దూరాన వెళుతున్న ముసిలిగాడ్ని కేకేశాడు.— "మా పని తిరగక ఏమైంది?"

"కాదు మరి నాలుగు వ్యాపకాలు వున్నప్పుడు తిరగక తప్పుతుందా? ఎప్పుడూ ఏదో వ్యవహారం వుండనేవుంటుంది" అన్నాడు రామారావు. వెంకయ్య ఆ వూళ్ళో ఓ పెద్దమనిషి. ఎప్పుడూ ఎవరోహాను ఏదో పనిమీద ఆశ్రయిస్తూనే వుంటారు. ఆ సంగతి రామారావుకి తెలుసు.

"కూటికీ గుడ్డకీ పనికిరాని వ్యాపకాల కేమొచ్చిగానీ విశేషాలేమిటి? పరీక్షలైపోయాయా?" అనడిగాడు వెంకయ్య.

"పరీక్షలైపోయి వారం పదిరోజులౌతోంది. బాగానే వ్రాసా" అన్నాడతను.

ముసిలిగాడు వచ్చాడు.

"ఓరేయ్ ముసిలీ! ఆ పెట్టెను మా కుటుంబయ్య బావగారింటిదాకా తీసుకుపోరా!" అన్నాడు వెంకయ్య వాడి నుద్దేశించి.

వాడు రామారావు చేతిలోని సూటుకేసుని అందుకొని అతనివంక ఎగా దిగా చూడసాగాడు. వెంకయ్య అది గమనించి "కుటుంబయ్యగారబ్బాయిరా!" అన్నాడు.

"రామయ్య దొరగారా! అంటూ ఉబ్బితబ్బిబ్బయిపోయి తన అమాయికత్వానికి తనను తానే నిందించుకున్నాడు.

ఓ సారి అవునన్నట్టు తలూపి "సరే! పోయిరా, బాబూ! ఇందాకటినించి నిలబడే వున్నావు."అంటూ ముందుకు సాగాడు. రెండడుగులు వేసాడో లేదో వెనక్కి తిరిగి చూచాడు. అప్పు డాయన మెదడులో ఏదో భావం మెరపు తీగలా తళుక్కుమంది. విప్పారిన మొహంతో ముందుకు సాగాడు.

రామారావు ఊరి దరిదాపులోకి వచ్చేశాడు. దో దాటితే ఊళ్ళో పడ్డట్టే! ఇన్నాళ్ళకి ఇంటికి వెళుతున్నాం అని ఉత్సాహంకొద్దీ మరింత హుషారుగా నడుస్తున్నాడు. తండ్రి అన్నిటినీ మించి పుట్టినూరు!...చేరుతె తి పిలుస్తున్న సంతోషంతో, ముందుకు సాగిపోతున్నాడు. మందహాసం ఓ సారి వెనక్కి తిరిగి చూచాడు. అతని వెనుకనే ము గాడు...

"ఏమో దొరా! చెప్పులు అరిగిపోతుండాయ్" అన్నాడు ముసిలిగాడు రెండడుగులు వేసిన తరువాత.

"ఎందుకేమిటి?" అడిగాడు రామారావు.

"శ్యామలమ్మారు పెద్దోరయ్యారుగా!"

"అల్లుడుకోసమా!" అన్నాడు రామారావు విస్తుపోయి.

"అవును దొరా!" అన్నాడు వాడు.

శ్యామల చాల చిన్నపిల్ల తన కళ్ళముందు పుట్టి పెరిగిన పిల్ల! అంత చిన్న పిల్లకోసం యిన్ని తిప్పలు పడుతున్నాడా!

అంత తొందరేముంది. ఛీ! మనవాళ్ళంతా యింతే గదా! పిల్లలకోసం పెళ్ళి చేసుకుంటారు! మళ్ళీ పుట్టినప్పటినుంచి వారి పెళ్ళిళ్ళ సంగతి ఆలోచిస్తూ వుంటారు—అంత కంటె జీవిత పరమావధి మరొకటి లేనట్టు!

"అవును దొరా! ఆడపిల్లలు ఎంతలో పెద్దోరవుతారు!" అన్నాడు ముసిలిగాడు.

రామారావు అతని మాటల్ని వినసట్టే పరధ్యానంగా న్నాడు.

"దొరగారు చదువుతోంది కాశీలోనా ఆండీ?" అడి ముసిలిగాడు రెండడుగులు వేసిన తరువాత.

"అవునోయ్!" అన్నాడు రామారావు- "మీ ఏసు ం ఏం చేస్తున్నాడోయ్?"

"కమతమే దొరా! సూరయ్యదొరగారి దగ్గర."

రామారావు చిన్నతనంలో వాడు వీళ్ళదగ్గరనే చిన్న పాలేరుగా వుండేవాడు. తనంటె వాడెంత ప్రేమగా వుండేవాడు! ముంజల రోజులు వచ్చాయంటె తనకోసం రోజూ ఎన్నో ముంజలు తీసుకొచ్చేవాడు! అప్పుడప్పుడు వెంటబెట్టుకొని మరీ వెళ్ళేవాడు.

"పెళ్ళి చేసేవా?"- అడిగాడు రామారావు.

"మీకాడ మానేసినాకనే చేసాను బాబయ్యా!" అన్నాడు ముసిలిగాడు- "ఇప్పుడు ఇద్దరు పిల్లలు కూడాను."

"ఏసుపాదానికి ఇద్దరు పిల్లలనేటప్పటికి రామారావుకి నవ్వు వచ్చింది. 'మీ యిద్దరూ ఒకే యీడువాళ్ళు అంటూ

ఉండేది అతని తల్లి.' అయితే నాకూ పుట్టేవారేమో! అనుకున్నాడు. కాని, ఆ మరుక్షణంలోనే తన తెలివితక్కువ ఆలోచనకి తనలోతానే సిగ్గుపడ్డాడు!...ఛీ! ఛీ! తనకుకూడా యీ వెధవ ఆలోచనలేవిటి!...

బజారు అరుగుమీద కూచుని మొహం కడుక్కుంటున్న శీతయ్య— "ఇదేనా రావడం మాఁవా!" అన్నాడు రామారావుని చూచి.

"అవును తాతా!" అన్నాడు రామారావు.

రామారావు తాత రామయ్య శీతయ్య యిరుగు పొరుగు రైతులు. ఇంతప్పటినించి ఒకే కంచంలోతిని ఒకే మంచంమీద పడుకొని బ్రతికారు. శీతయ్య ఆవూరు యిల్లరికానికి వచ్చిన మొదటి రోజుల్లో ఆప్తబంధువుగా ఆదరించాడు రామయ్య. వారిద్దరిదీ మామా అల్లుళ్ళ సంబంధం! కాని, అతన్ని ఒంటరిగా వదిలి రామయ్య ముందు ప్రయాణం కట్టాడు. ఆ అలవాటు కొద్దీ రామారావుని 'మాఁవా!' అని పిలుస్తుంటాడు. తన మాఁవ చచ్చిన లోటు పొలంమీద కనిపించినా ఊళ్లోమాత్రం కనపడలేదు శీతయ్యకు.

"కులాసా తాతా?" అడిగాడు రామారావు.

"కాటికి కాళ్లుచాచిన మా కులాసాకేముంది బాబూ! అయినా చావక తప్పటంలేదు!" అన్నాడు శీతయ్య— "ఏరా, బాబూ! చాలా దూరంనించి వస్తున్నావు."

రామారావు ముందుకు సాగాడు...

"అమ్మా అన్నయ్య వచ్చాడే!" అంటూ ఎగిరి గంతేసింది, ముందు వాకిట్లో కూచున్న సరోజిని. అన్న మెడను కావలించుకుంది...

లక్ష్మమ్మ సంతోషంతో మొహం చాటంత చేసుకొని- "అబ్బ! ఉండవే! కాస్తవాణ్ణిని ఇంట్లోకి రానీయ్!" అంది. యింట్లోనించి వస్తూనే- "కాళ్ళు కడుక్కోరయ్యా!"

ఆమె ముసిలిగాడిని చూచి- "ఏంవిరా! ముసిలాయ్! ఈమధ్య ఎక్కడా అగపడటం లేదు! మీ కోడలు ప్రసవించే రోజులనుకుంటా." అనడిగింది.

"ప్రసవించిందమ్మగారూ! మగపిల్లాడు కలిగేడు." అన్నాడు ముసిలాయ్.

"పోనీలే. నాలుగేళ్ళుంటే వాడిపొట్ట వాడే పోసుకుంటాడు. మీ ఏసుగాడూ. మావాడూ. ఒహాయీడువాళ్ళేరా!" అందామె.

"కోడలమ్మ వస్తే మీకూ రెండు సంకల్లో వుండేవారమ్మా!" అన్నాడు ముసిలిగాడు.

"ఇంటికి పోయేప్పుడు కనపడిపోరా. కాస్త నల్ల పచ్చడి తీసుకెళుదువుగానీ" అందామె.

ముసిలిగాడు "అలాగేనమ్మా!" అంటూ వెళ్ళిపోయాడు.

"ఏమిరా అయ్యా, కాస్త ఉత్తరమన్నా వ్రాయలేదు?" అంది రామారావుకి తుండు అందిస్తూ.

"ఎలాగూ వస్తున్నాకదా అని ఉత్తరం వ్రాయలేదు." అన్నాడు రామారావు తుండు అందుకుంటూ.

"చాలా చిక్కిపోయావు రయ్యా!" అనుకొంది లక్ష్మమ్మ కొడుకుని చూచి తనలోతానే.

## 2

కొన్ని కుటుంబాలు ఎప్పుడూ సుఖంగానే కాలక్షేపం చేస్తాయ్. మరికొన్ని యీ అనంత యాత్రలో ఒడిదుడుకులు పడుతూనే అందుబాటులోవున్న ఆనందాన్నికూడా అనుభవించ లేని దుస్థితిలో వుంటాయ్... కొందరు యితరుల ఆనందాన్ని, ఆహ్లాదాన్ని తమవిగా స్వీకరించి నవ్వుతూ నవ్విస్తూ వుంటారు; మరికొంత మంది తమ బాధల్ని యితరులకు ఆపాదించి, తమతో పాటు వారినికూడ దుఃఖ సముద్రంలో ముంచి లేపుతారు.

కుటుంబయ్య కుటుంబం మొదటి రకానికి చెందినది. ఉన్న దానినే స్వీకరించి అనుకూలంగా మలుచుకోగల మానసిక

చైతన్యం ఆయనకుంది. నిండుగా, నిబ్బరంగా బ్రతకటం ఆయనకు తెలుసు. ఆయనకు దొరికిన భార్యకూడ అలాంటిదే. కుటుంబ కష్టసుఖాలు భర్తచేతుల్లో లేవు. భార్య చేతుల్లో వుంటాయంటారు. లక్ష్మమ్మ విషయంలో అది ముమ్మాటికీ నిజమేననిపిస్తుంది.

వారికి ఇద్దరు కుమారులూ, ఒక కూతురూను. పెద్దవాడు రామారావు, రెండోవాడు గోపాలరావు... వారి తరువాత మగపిల్లలిద్దరు పుట్టి చనిపోయారు. ఆ తరువాత కలిగిన సంతానం సరోజిని.

రామారావు కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో ఎం. ఏ. పరీక్ష వ్రాసి వచ్చాడు. ఇరవైమూడేళ్ళ వయస్సు. సరిపడ మనిషి. గోధుమరంగు చాయ... ఆకారానికి తగ్గ బుద్ధి. చదువు సంధ్యల్లో చిన్నప్పటినుంచి చురుకైన వాడు. బి. ఏ. వరకు తప్పకుండా పాసవుతూ వచ్చాడు. "విద్యచేకూర్చు వినయంబు"-అన్నట్టు అతని వినయాన్ని చూచి ఊళ్లోవాళ్ళంతా మురిసిపోయేవారు.

ఇక చదువు మాని యింటిదగ్గర వుండి వ్యవసాయం చూచుకోమని తండ్రి అంటే కాదని పట్టుదలమీద వెళ్ళి కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో చేరాడు. రైతుకి చదువు కూడు బెట్టదని, వంశపారంపర్యంగా వస్తున్న భూమిని సేద్యం చేసుకుంటూ, ఆ గడ్డను నమ్ముకొని వుండటం మంచిదని ఆయన నమ్మకం. అందుకే కష్టపడి తన తండ్రి తనకప్పచెప్పిన పది హేను యెకరాల భూమిని పాతిక యెకరాలు చేయగలిగాడు. కాని, రామారావు ఆయన మాటలను వింటేనా?...

రెండో కొడుకు గోపాలరావు చదువుకంటె జీవితంలో చురుకైనవాడు. అలాఅని చదువులో తక్కువవాడని కాదు. అతని మనస్సు చదువుమీద కంటె సమస్యల్లో ఎక్కువగా చిక్కుకొని వుంటుంది. బళ్ళో చెప్పే పాఠాలకంటె జీవితంలో నేర్చుకునే పాఠాలు ఎక్కువ విలువ గలవని అతని నమ్మకం. గ్రామ సమస్యలమీద దృష్టి నధికంగా కేంద్రీకరిస్తాడు. అప్పటికే మూలపడివున్న గ్రంథాలయ పుస్తకాలన్నీ బయటకు తీశాడు. కొత్త పుస్తకాలను సేకరించే ప్రయత్నంలో ఓ నాటకాన్నికూడ వేయించాడు.

ఈ సంవత్సరం వేసవి శెలవుల్లో ఆటల పోటీలు జరపాలని అతగాడి ఉద్దేశ్యం. ఇప్పుడు ఆ ప్రయత్నంలోనే వున్నాడు. స్కూలుఫైనలు పరీక్ష వ్రాశాడు. పాసవటానికి ఏంభయం లేదుకాని, అవసరదానికంటె యెక్కువ వ్రాస్తాడని అతని మాష్టారు బాధ!

అతడి యీ చేష్టలన్నీ చూచి కుటుంబయ్య విసుక్కునేవాడే. కాని, యింటి వ్యవహారాల్లోకూడ అంతే జాగ్రత్తగా వుండేవాడు. పొలంలో పాలేరు ఏంచేస్తున్నాడో తెలుసుకొనేవాడు. కూలీలు ఎంత మందో ఆరా తీసేవాడు. యెకరానికి యెంత కూలీ అవుతుందో లెక్క గట్టేవాడు. రైతులు ఏ పైరుకి ఏ యెరువు వాడుతుంటారో ఆచూకీ తీసేవాడు. అందుకే కుటుంబయ్య అతడిని ఏమీ అనలేని నిస్సహాయ స్థితిలో వుండేవాడు!

నల్గురు మగపిల్లల తరువాత పుట్టినకూతురు సరోజినంటె యింట్లో వాళ్ళందరికీ గారాభం. సరిగ్గా బడి కెళ్ళదు. వెళ్ళినా

జాగ్రత్తగా చదవదు. బడికి పంపవేమిటి? అని యిరుగు పొరుగు వారెవరైనా అంటే "ఆడపిల్లలకి చదువు వెందుకన్నా!" అంటూంది లక్ష్మమ్మ. ఆడపిల్లలకు చదువులు పనికిరావనే తీరులో మనిషి ఆమె.

కనుకనే రెండేళ్ళక్రితం అయ్యో అయ్యో రామారావు వివాహం ఆగిపోయింది. ఆ ఊరి నానుకొనివున్న రంగాపురం సంబంధం ఖాయ పర్చుకున్నారు. ఆయేడు అమ్మాయి స్కూలు ఫైనలు పరీక్ష వ్రాసింది. తీరా ఖాయమనుకున్నాకనే ఈ విషయం లక్ష్మమ్మకు తెలిసింది. అదీకాకుండా వాళ్ళు నల్గురు అక్కా చెల్లెళ్ళనికూడ వింది. మగసంతానం లేని కుటుంబంతో సంబంధం చేసుకోవటం మంచిది కాదని ఆమె నిర్ణయం. అక్కడితో ససేమిరా వల్లకాదంది. అంతే! హైకోర్టు తీర్పుకి అపీలు లేదు.

ఆ మర్నాడే కుటుంబయ్య- 'ఈ యేటికి మా అబ్బాయి పెళ్ళిచేయటం మానుకున్నామని' కబురు చేసాడు రంగాపురం. ఖాయపరుచుకున్న పెళ్ళి ఆగిపోయేప్పటికి నల్గురూ నానా రకాలుగా చెప్పుకున్నారు.

కొంతమంది కుటుంబయ్యకు మేనగోళ్ళను యీా కొడుక్కి చేసుకుందామని వుంటె మరికొంతమంది పెద్దచదువు చదివితే పెద్దకట్నం వస్తుందని ఆశ పడ్డాడన్నారు. ఇంకా కొంత మంది— "అబ్బే అదేంకాదు. పిల్లవాళ్ళే యివ్వన్నారు." అన్నారు. కాని ఎవరేమి చెప్పినా కుటుంబయ్య మనస్సుకూడ ఆ వ్యవహారం అలా ముగిసినందుకు బాధపడ్డాడు!...

రామారావు వచ్చిన మర్నాడు ప్రొద్దునే బజారువుగు మీద కూర్చొని మొహమార్జన చేస్తుంటే కుటుంబయ్య వచ్చి, "అత్తగారింటికెళ్ళివచ్చావా?" అనడిగాడు.

"వెళ్ళిరాలేదు" అన్నాడు రామారావు నోట్లో పుల్ల తీసి వుమ్మి వూస్తూ. అతడు కాశీనుండి ప్రయాణం చేసిన బడలిక యింకా పోనేలేదు. వచ్చీరావటంతోటే మంచాని కప్పచెప్పినవాడు మళ్ళా సాయంత్రం అమ్మ లేపేనరకు మెలకువ రాలేదు. ఆ తరువాత కూడ నిద్ర బద్ధకంతోనే రెండు మెతుకులు తిని మళ్ళా మంచాని కప్పచెప్పాడు. అందువల్ల ఎక్కడికీ వెళ్ళలేకపోయాడు.

"ఒకసారి వెళ్ళిరా." అన్నాడు కుటుంబయ్య ఆయన మనస్సులో ఏముందో?... కాని యిది విన్న రామారావు మనస్సు చివుక్కుమంది. తాను యింటిదగ్గర వున్నప్పుడు అత్తగారింటికి వెళ్ళకుండా వుండలేడు. ఒక్కోరోజు నే అక్కడే తిండి తిని పడివుండేవాడు. అటువంటిది. వెళ్ళిరమ్మని తన కెందుకు చెప్పాల్సి వచ్చిందో అతని కర్థం కాలేదు. అందుకే అది విన్న రామారావు వులిక్కిపడ్డాడు...

ఇంతలో సరోజిని వచ్చి బయట బజారుగేటుదాకా వచ్చి, "అన్నా, అమ్మ పిలుస్తోంది." అని చెప్పినప్పుడు మళ్ళీ యీ లోకంలో పడ్డాడు.

"కాఫీ అయిందనుకుంటా, త్వరగా వెళ్ళు." అంటూ కుటుంబయ్య బయటికెళ్ళిపోయాడు.

రామారావు పరాకుగానే గబగబా మొహం కడు క్కొని లోని కెళ్ళాడు...

లక్ష్మమ్మ కాఫీ అందించి, "మళ్ళా లగ్గాలు దగ్గర కొస్తున్నాయ్. మంచి సంబంధంచూచి అనుకుంటే బావుం టుంది." అంది. ఆమె కొడుకు వచ్చిన మర్నాడే యింతత్వరగా పెళ్లి ప్రస్తావన తీసుకొచ్చిందంటే కారణం లేకపోలేదు. పక్కింటి సూరయ్యభార్య కామాక్షమ్మ. "కొడుక్కి పాతికేళ్లు వచ్చినా పెళ్లిచేయక చదువుకిపంపిందని" ఆమెను అప్పుడప్పుడు దెప్పతూ వుంటుంది. అదీకాకుండా ఆమె కన్నారి వూరివా రొహాడు తిరుగుతూండటం వల్లకూడ ఆమె ఆ ప్రస్తావన తీసు కొచ్చింది. "చదువు చదువు అన్నావు! అదికూడ పూర్త యింది. ఇహనైనా ఒప్పుకోరా బాబు!"

రామారావు జవాబేమీ యివ్వలేదు.

"మొన్న వచ్చివెళ్లారు వారు. వాళ్లబ్బాయి బెజ వాడలో నీతో కలిసి చదువుకున్నాట్ట!" అంది లక్ష్మమ్మ.

"ఎవడే వాడు?"

"పర్వత" వారబ్బాయి. సత్యనారాయణ అనుకుంటా వాడిపేరు!" అంది లక్ష్మమ్మ.

"ఓహో వాడా?"

"అవును! వాళ్లే. మావయ్యను వెంటబెట్టు కొచ్చారు మొన్న. మావయ్యనటం, మంచి కట్నంకూడ యిస్తారని..."

"ఇప్పుడు పెళ్ళికొచ్చిన తొందరేమిటి లెద్దూ?" అంటూ రామారావు కాఫీ కప్పు టేబిల్ మీద పెట్టి బయటకెళ్ళి పోయాడు.

"అయ్యో! అదేమిటిరా! అంతా వినిపించుకోకుండానే వెళ్ళిపోతున్నావు" అని మాత్రం అంది లక్ష్మమ్మ. అతడా మాట వినిపించుకున్నాడో లేదో తెలియదు కానీ చింతపండు అప్పుకోసం వచ్చిన కామాక్షమ్మ మాత్రం వింది.

## 3

"అత్తా! అత్తా!" అంటూ ఎవరో తలుపు తట్టినట్టు వుంటె పెరటి దొడ్లో పని చేసుకుంటున్న రాజమ్మ వచ్చి తలుపు తీసింది.

"నీవా బాబు?!" ఎప్పు డొచ్చావు? "రా, లోనికి రా!" అంటూ జవాబు కెదురు చూడకుండానే లోనికి దారితీసింది.

"నిన్న వచ్చా నత్తా!" అంటూ రామారావు లోనికి వచ్చాడు.

"రాత్రి నాన్న చెప్పాడు వచ్చావని" అంది రాజమ్మ— "ఈ కుర్చీలో కూర్చో బాబు!" అంటూ కుర్చీ దగ్గిరికి లాగిందామె – "వంట్లో బావుంటుందయ్యా?"

"బాగానే వుంది అత్తయ్యా! సుశీల ఏది? కుర్చీలో కూచుంటూ అడిగాడు.

"ఇప్పుడే ఎటో వెళ్ళింది! రాత్రి రెండు మూడు సార్లు అడిగింది. బావయ్య మన యింటికి వచ్చాడమ్మా అని పరీక్షలై పోయాయా బాబు?"

"ఆఁ అయిపోయాయి. బాగానే వ్రాసా."

"ఏమో బాబు! దేశంకాని దేశం వెళ్ళావు. కులాసాగా తిరిగి వచ్చావు, అంతే చాలు!" అంది రాజమ్మ "కూచో బాబు! ఇప్పుడే వస్తా!" అంటూనే ఆమె లోనికెళ్ళింది.

రామారావు కూచుని ఏమేమో ఆలోచిస్తున్నాడు. అతని మనస్సు గాలి పటంలా ఆలోచనా తరంగాలలో రెపరెప కొట్టుకుంటోంది. ఇదివరకెంతో చనువుగా తిరిగిన యీ ఇల్లు తన కింత క్రొత్తదిగా వుందేమిటి? అత్తయ్యకూడ తనను ఓ బంధువుని చూచినట్టు చూస్తోంది.

రాజమ్మ ఓ గ్లాసుడు పాలు తీసుకొచ్చి అతని కందించింది. అతడు త్రాగానని ఎంత చెప్పినా ఆమె ఒప్పుకుంటేనా? అతనికిహ త్రాగక తప్పింది కాదు.

"ఏమో బాబు! మీ మామయ్య పని అయిపోయింది. ఇదివరకటిలా సరిగ్గా తిరగటంలేదు."అంది రాజమ్మ నిరాశతో ఓ నిట్టూర్పు విడుస్తూ.

"ఆరోగ్యం బావుంటంలేదా, యేమిటి?"

"వయసు మళ్ళిన తరువాత కులాసాగా వుండటమేమిటి? లేకపోవటమేమిటి? అంది రాజమ్మ. ఆమెను రెండో సంబంధానికి యిచ్చారు. వారిద్దరికీ వయస్సులో చాల తేడా వుంది. పెళ్లయిన నాలుగైదేళ్ళవరకు సంతానం కలగలేదు. ఆతరువాత ఓ అమ్మాయి కలిగింది.

"ఏడీ మాఁవయ్య! ఎక్కడికి కెళ్ళాడు!" అడిగాడు రామారావు.

"గడ్డితోలుతున్నారు బాబు!" అంది రాజమ్మ.

"ఇంకా పొలం వెళ్ళటం మానలేదన్నమాట! ఎవరికి సంపాయించి పెడతాడు!" అన్నాడు రామారావు నవ్వుతూ.

"ఇంకా ఎవరికో ఎందుకూ?" అంది రాజమ్మ. "మహారాజుల్లాంటి మేనల్లుళ్ళుండగా!"

రామారావు సిగ్గుతో తల వంచుకున్నాడు. తన మాట తనకే బాణమై గుచ్చుకుంటుందని అతడు వూహించలేదు.

ఇంతలో ఎక్కడనించో సుశీల పరుగెత్తుకొచ్చింది.— "అమ్మా! అమ్మా!" అంటూ అనుకోకుండా వచ్చిన బావను చూచి సిగ్గుతో అమ్మవెనుక్కెళ్ళి నక్కింది.

"ఇటురా! సుశీలా!" అన్నాడు రామారావు.

"బావయ్య పిలుస్తుల్లా! వెళ్లు!" అంది రాజమ్మ. "సరే గాని, దొడ్లో నాన్న వున్నారేమో! చూచిరా!"

సుశీల బయట కెళ్ళింది. రాజమ్మకూడ "ఇప్పుడే వస్తా! కూచో బాబు! దాలి మండిపోతోంది!" అంటూ లోని కెళ్ళిపోయింది. రామారావు ఒంటరిగా కూచొని ఏమేమో ఆలోచిస్తున్నాడు. అత్తకూడ చిక్కి శల్యమైపోయింది. ఆమె జీవితమే

అంత! పెండ్లయిన మరునాడే వంటిపెట్టటానికి వచ్చింది.... అందులో ఆయనకు రెండో సంబంధం! ఆమె నవ్వుతూవుండగా అత డెన్నడూ చూడలేదు. అందుకే ఆమె అంటె అతనికి ప్రత్యేకాభిమానం! కొందరికి వివాహం ఆనందదాయక మైతే మరి కొంత మందికి గుది బండలా పరిణమిస్తుంది. కొందరి జీవితాలు వివాహంలో కొత్త సోయగాలు యీనితే మరి కొందరి జీవితాలు కుమిలి కుమిలి కుళ్ళిపోతాయ్.

వివాహం జీవితంలో ఓ మైలురాయి, ఓ మలుపురాయి కూడాను. అక్కడే ప్రయాణం ఎటో నిర్ణయమౌతుంది. కాకపోతే అందరూ దానిని స్వర్గానికి రాచబాటగా స్వీకరిస్తారు. కాని, ఏ కొందరో ఆ ఆనందాన్ని అనుభవించ గలుగుతారు. మానవు లందరూ ఆ ప్రయత్నంలో ఎప్పుడు సఫలీకృతు లౌతారో కాని, ఆ రోజు నిజంగా భూతలస్వర్గం ఏర్పడుతుంది. మానవచరిత్రలో మరపురాని ఘట్టం! స్త్రీ పురుషుల సంబంధం ఎంత సహజమైనదీ, ఎంత పవిత్రమైనదీనూ! కాని, మానవుడు దానిని గమనించలేక స్వర్గానికని ప్రయాణమై నరకానికి చేరు కుంటున్నాడు.

రాజమ్మ వచ్చి "దొడ్లో లేరంట బాబు" అన్నప్పుడు, మళ్ళీ యీ లోకంలో పడ్డాడు రామారావు.

"లేరా!" ... సరే అలా అయితే మళ్ళా వస్తాలే!" అంటూ లేచి నిలబడ్డాడు.

"ఈ పూట యిక్కడుండరాదు బాబు!" అందామె.

"వద్దులే అత్తా! ఎలాగోలా వుంటాగా!" అంటూనే బయట కెళ్ళిపోయాడు.

అతడు వెళుతూంటె రాజమ్మ చూస్తూ నిలబడింది. ఆమె కప్పుడు ఏదో ఆలోచన కలిగింది. కొద్ది రోజుల పూర్వం ఏదో మాటల సందర్భంలో కామాక్షమ్మ అదేమాటచెప్పింది. నిజమే! ఆడపిల్లలు ఎంతలో పెద్దవా రవుతారు? చదువు పూర్తయింది. బాధ్యత తెలుసుకోగల యీడొచ్చింది.... గోపీ యింకా చిన్నవాడు. ఏమాత్రం వ్యక్తత రావాలన్నా యింకా నాలుగైదేళ్లు ఆగాలి...అప్పటి వరకు యీ ఘటాలు వుండొద్దూ?

ఈ విధంగా ఆలోచిస్తూ ఆలోచిస్తూ వుండగనే ఆమె మనస్సు చివుక్కుమంది. ఈడూ జోడూ లేని వివాహమేమిటి? తాము చచ్చిపోతామని బిడ్డల జీవితాల్ని నరకకూపం చేసి పోతామా! ఛీ! యింతకంటె నీచం ఏముంది? తన బ్రతుకు చూడరాదూ! ఈ విధంగా యింకా యేమేమో తలపోస్తూ రాజమ్మ తనను తానే నిందించుకుంది.

"అమ్మా! పాలేరు అన్నానికి వచ్చాడే!" కూతురు మాటలు విని రాజమ్మ వులిక్కి పడింది. ఏదో తప్పు చేసిన దానిలా.

"రా! అమ్మా! రా!" అంటూ కూతుర్ని తనదగ్గరకు తీసుకొని హృదయానికి హత్తుకుంది తల్లి రాజమ్మ.

4

రామారావు మేనత్తగారింటిదగ్గరనుండి తిరిగి వస్తూ వుండగా ఓ సంఘటన జరిగింది. ఓ యాభై గజాలు దాటి వచ్చాడో లేదో యింతలో బాలయ్య ఇంట్లోనుంచి అరుపుల్లూ, కేకలూ, ఏడ్పులూ—ఒక్కసారి రణగొణ ధ్వనిగా మారాయి. బాలయ్య అతని మేనత్త రాజమ్మ మరిది!

ఏమిటో తెలుసుకుందామని అతడు గబగబా లోనికి వెళ్ళాడు. అతని వెనకాలె యింకా కొంతమంది వచ్చారు. ఆ హడావిడిలో ఏమిటో సంగతి తెలుసుకోవడం కూడ కష్టమైంది.

బాలయ్య చేనూ, వెంకయ్య బావమరిది కామరాజు చేను—ఒకదాని కొకటి ఆనుకొని వున్నాయి. బాలయ్యకు బండిదారి కామరాజు చేలోనించి వుంది. ఆ బళ్ళదారి యీనాటిది కాదు. ఎప్పటి నుండో, బహుశా తాత ముత్తాతల కాలంనుంచి వస్తున్నది. కారణం, ఆ భూమి బాలయ్య తమ్ముడిది. నిండు వయస్సులో పండులాంటి సంసారాన్ని మన్ను చేసి, కాలంచేసిన తమ్ముడి భార్య ఆస్తి సంతతినీ

అమ్మ్కొని కన్నవారింటికి వెళ్ళింది. ఆమె అలా అమ్మ్కొని కన్నవారింటికి వెళ్లటం యిష్టంలేక అతని అన్నదమ్ములు భూములకు బేరాలు రానీయలేదు. చివరకు కామరాజు తండ్రి తక్కువ ధరకు వ్రాయించుకున్నాడు. దాంతో పూర్వంనించి వస్తున్న వైరభావం మరింత వికృతరూపం ధరించి అనువు దొరికినప్పుడల్లా బహిర్గత మౌతూనే వుంది.

ఇవాళ కామరాజు చేలోనుండి బాలయ్య గడ్డిబండి తోలుకొస్తుంటే కామరాజు అడ్డంతగిలాడు...అడ్డుతగలటంతో ఆగిపోతే బావుండేది! కర్రలుకూడ విసురుకున్నారు. బాలయ్యకు దెబ్బలు తగిలాయ్...

ఈవిషయం బాలయ్య బుడ్డపాలేరు రాముడు వచ్చి చెప్పాడు. అక్కడితో ప్రారంభమైంది. యీ రణగొణ ధ్వని. ఈ సంగతి తెలుసుకొని అక్కడకు చేరిన నల్గురు గబగబా పొలం పరిగెత్తారు. రామారావుకూడా వారిననుసరించాడు.

వారంతా అక్కడకు చేరుకునేటప్పటికే రామారావు నాన్న కుటుంబయ్య ఆయన బావమరిది రామయ్య - వాళ్ళంతా అక్కడేవున్నారు. కామరాజు, కామరాజు పాలేరు ముత్తడూ ఐపూఅంతు లేకుండా పారిపోయారు.

బాలయ్యకు తలకు కట్టుకట్టి యింటికి తీసుకొచ్చారు. బండిని అక్కడేవదిలి, ఎడ్లను యింటికి తోలుకొచ్చారు. మునసబు పోలీసు రిపోర్టిచ్చాడు.

సాయంత్రం ప్రొద్దుకూకుతూవుండగా పోలీసులొచ్చారు. పోలీసులొచ్చేటప్పటికి స్తబ్ధంగావున్న పల్లెవాతావరణంలో ఓ

కదలికవచ్చింది. ఎక్కడచూచినా గుస గుసలే ! ఉదయం జరిపిన సంఘటనే మరచినవారు పోలీసుల్ని చూచి విస్తుపోయారు

నిజంచెప్పాలంటే పల్లెవాతావరణంలో అటువంటి తోపులాటలకు, అంత ప్రాముఖ్యత వుండదనే చెప్పాలి. ఇలాటి సంఘటనలు జరగటం నల్గురూ ప్రోగయి ఏదోరకంగా సర్ది చెప్పడం. అవి అక్కడిదే సమసిపోవడం జరుగుతుంది...

కాని మునిమాపువేళవూర్లో పోలీసుల్ని చూచి అంతా విస్తుపోయారు. మునసబు అంతమాత్రానికే ఎందుకు కబురు పెట్టాడురా, అన్నారు. వయస్సు మళ్లినవారు.పోలీసులతో వచ్చే సాధక బాధకాలు వారికి తెలుసు...

మునసబు అంత త్వరగా పోలీసు రిపోర్టు చేయటానికి కూడ మరొక కారణంవుంది. వెంకయ్య బావమరిది కామరాజు వాళ్ళ కుమార్తెల్లో అమ్మాయిని యీ మధ్య కొంచెం అల్లరి చేశాడు. అప్పటినుంచి అదునుకోసం ఎదురు చూస్తున్నాడు. ఈ సంఘటన జరిగిన వెంటనే రొట్టలేసుకుంటూ రామయ్య యింటికెళ్ళాడు. సంగతీ సందర్భం తెలుసుకొని పోలీసులకు రిపోర్టుచేసాడు. ఒక్కసారి గుక్క తిప్పుకొని పళ్ళు పటపటా నూరాడు మునసబు.

పోలీసులు వచ్చి జరిగినదంతా విచారించి వ్రాసుకెళ్ళారు. వెళుతూ వెళుతూ కామరాజు కర్రా చెప్పులు తీసుకెళ్ళారు. రేపు ప్రొద్దున్నే రామయ్యతో బాలయ్యను డాక్టరు దగ్గరకు తీసుకురమ్మన్నారు. డాక్టరు సర్టిఫికేట్‌ను తీసుకున్న తరువాతగానీ కేసును రిజిస్టరు చేయమన్నారు.

వారు తిరిగి వెళ్ళేటప్పటికి బాగా చీకటిపడింది. రోజూ ప్రొద్దుకూకేటప్పటికి వచ్చి బజార్లో కూచొని పిచ్చాపాటీ మాట్లాడుకునే ఆ గ్రామస్తులు ఆవాళ ఒక్కరూ యిల్లు వదిలి బయటికి రాలేదు. ప్రశాంతంగావున్న ఆ పల్లెవాతావరణంలో ఆ చీకటిలో అక్కడక్కడా కుక్కలు అరుపులు, యేడ్పులు మాత్రం వినిపిస్తున్నాయ్. అవి ఎవరో ఆత్మబంధువు చచ్చిపోయి నట్టు ఏడుస్తున్నాయ్...

## 5

వెంకయ్య రామారావుని చూచినప్పుడే అనుకున్నాడు తన కూతురు శ్యామలను అతనికిచ్చి వివాహంజేస్తే బావుంటుందని. అయినా ఎలాగూ బయలుదేరానని వెళ్ళి వెంకటాపురం కుర్రాడిని చూచి వచ్చాడు. అతడు బి. ఏ. చదివాడు ఆస్థి బాగానే ఉంది! తల్లిదండ్రులకు ఒక్కడే!... కుర్రాడు చామనచాయ. అయినా ముక్కూ మొహమూ బాగానే ఉన్నాయ్...

ఆయన స్నేహితుడు మునసబు కుర్రాడిని చూపుతూ- "మగపిల్లవాడికి అందమెందుకయ్యా? గుణం ప్రధానంగానీ!" అన్నప్పుడు వెంకయ్యకూడ తనలో అదే మాట అనుకున్నాడు. కాని, యింకా లోతుకు దిగి వివరాలు తెలుసుకొన్న తరువాత మెదలకుండా తిరిగి రావల్సి వచ్చింది. మునసబు కొడుకు అతని కేదో పొడ ఉందని చెప్పాడు...

వెనక్కు తిరిగి యింటికి వస్తూ మరల రామారావు సంగతి ఆలోచించాడు. అతనికీ పదెకరాల భూమిఉంది. చదువు ఉంది. గుణం కలవాడు... ఏ రకంగా చూచినా అతని కతడే సాటి! ఏదో దూరంపోయినా దుఃఖంలేదు. దూరపు కొండలు నునుపు. అంతకంటె మరేమీ లేదు అనుకున్నాడు తనలో తాను.

కాని, తీరా యింటికి వచ్చేప్పటికి ఊళ్ళో పరిస్థితులు శృతిమించి రాగాన పడినాయ్. ఆయన బావమరిది కామరాజు కుటుంబయ్య బావమరిది తమ్ముడిని కొట్టడం, మునసబు పోలీసు రిపోర్టు ఇవ్వడం- అన్నీ ఒకదానివెంట మరొకటి జరిగి పోయాయ్. ఇహ ఆ పరిస్థితిలో తన మనస్సులోని మాటను యెవరిదగ్గర బయటపెట్టలేక పోయాడు. పరిస్థితులకు లొంగి పోయి కొమ్ము కాయక తప్పలేదు.

కొంతమంది పరిస్థితుల్ని సృష్టించుకోగల సమర్థుడు మానవుడు అంటారు. కాని, అది యెంతవరకు సత్యమో తెలియదు కాని, మానవుడు మాత్రం పరిస్థితులకు బానిసని మనం నిష్కర్షగా చెప్పగలం. దానికే మన తాత్వికులు మరోవిధంగా చెప్పారు- తానొకటి తలిస్తే దైవ మేరొకటి తలచాడని...

సుడిగుండంలో పడ్డ గడ్డిపరకలు, ఎటుకొట్టుకు పోతాయో తెలియదు, ఏమౌతాయో తెలియదు. అయినా ఏమో ఆశలు! ఆశయాలు! ఆదర్శాలు! ముడి తెగని అనుబంధాలు.

నిజానికి వెంకయ్యకు ఊళ్లో కాలుపెట్టేంత వరకు వున్న ఊహాలు వూళ్ళోకి వచ్చిన తరువాత లేవుగదా! అందుకే "మనం నిమిత్తమాత్రులం. మన వెనుక మనల్ని ఆడించే శక్తి ఏదో ఉంది" అనుకున్నాడు మరోసారి.

ఆనాడు ఇంట్లో నీళ్ళూ పాలూ చూచుకొని పొలం బయలుదేరేప్పటికి సూరయ్య వచ్చి కలిసాడు— "పొలమే మిత్రయ్యా! నేనూ వస్తున్నా." అంటూ.

"అవును బాబాయి! పడమటి పొలం వెళ్లొద్దామని బయలుదేరా. పెసరపొట్టు కప్పలేదు. గొడ్డుమేసి పోతున్నా యంటె కప్పించి వద్దామని." అన్నాడు వెంకయ్య. "ఈ పుగాకు చాల బాగుంది. మొన్న వెంకటాపురం వెళితే మునసబు యిచ్చాడు." అంటూ వెంకయ్య ఓ పాయి పుగాకు అందించాడు.

"వెంకటాపురం ఎప్పుడెళ్ళావురా, అబ్బాయి" అనడిగాడు సూరయ్య పుగాకు కాడ అందుకుంటూ.

"ఆవాళ పోలీసులొచ్చినప్పుడు నేను ఊళ్ళో లేనుగా బాబాయి." అన్నాడు వెంకయ్య.

"అలాగనే నేనూ విన్నాను." అన్నాడు సూరయ్య.

"పైగా పోలీసులను బుట్టలో వేసుకోటానికే వెళ్ళినట్టు కూడ విన్నావు కదూ. ఇదంతా నేనే చేయించానని కొంత మంది అనుకుంటున్నారు."

"అనేకమంది అనేక రకాలుగా అనుకుంటారు. అందరికీ మనమా బాధ్యులం. అసలు అలాంటి మనుష్యులు యెప్పుడూ ప్రతిచోట ఉండనే ఉంటారు. పనికట్టుకొని, అలాంటి మాటల్ని ప్రచారం చేస్తారు. వాళ్ళకు కావలసిందీ- ఏదో విధంగా తగాయిదా పెంచడం. ఇతరులు తన్నుకుంటూంటే చూస్తూ నవ్వుకోటానికి పుట్టించాడు వాళ్ళని భగవంతుడు. ఇంతకీ ఏం పని మీద వెళ్ళావు వెంకటాపురం?"

"అక్కడ ఓ సంబంధం ఉందంటే చూచివద్దామని వెళ్ళాను." అన్నాడు వెంకయ్య. "యిర్వై యెకరాల ఆస్తిఉంది. కొత్త మాగానీ, బలంచేయకపోయినా ఫర్వాలేదు. యెకరం నాలుగైదువేలు హీనంగా చేస్తుంది. ఒక్కడే కొడుకు. బి. ఏ. వరకు చదివాడు."

"మన కుటుంబయ్య కొడుకు చదివినదేనా?" అనడిగాడు మధ్యలోనే ఆపి.

"కాదు. వీడికంటే ఓ క్లాసు తక్కువే." అన్నాడు వెంకయ్య- "కుర్రాడు చామనచాయ. ముక్కూ మొహమూ తీరుగానే ఉన్నై. అందరూ అనటం, కుర్రాడు మంచి బుద్ధిమంతుడని. తన గొడవేమో, తనేమో"

"ఇంకా అలాగైతే బాగానే ఉంది." అన్నాడు సూరయ్య- "తల్లి దండ్రులు బాగున్నారా?"

"ఆఁ ఆఁ. తల్లిదండ్రులు బాగానే ఉన్నారు. తండ్రే స్వయంగా వ్యవసాయం చేయిస్తూ ఉంటాడు. ఆ బాధకూడ లేదు. పెళ్ళిచేసిన మరునాడే మన అమ్మాయి వెళ్లి కాపురం చేయవలసిన అవసరం లేదు."

"నీ పిచ్చిగానీ, ఈ రోజుల్లో అత్తమామలు ఉండటం-ఓ పీడగా ఉంటేనూ." అన్నాడు సూరయ్య.

"ఆ మాటకూడ నిజమే బాబాయి. అల్లుడు ఒక్కడే అయి ఉండాలి. అన్నదమ్ములబాధ ఉండకూడదనుకునేవారు కూడ లేకపోలేదు. ఒంటరిగాడి సంసారం ఇంటికి రాదని శాస్త్రం. అది వాస్తవంకూడాను."

"అలా అంటూనే నీవుకూడ అదే చేస్తున్నావు కదా." అన్నాడు సూరయ్య. ఆయన మొహమాటం లేకుండా మాట్లాడే మనిషి. ఆ సంగతి అందరికీ తెలుసు.

"నీవు అలా అంటే నేనేం చెప్పేది బాబాయి." అంటూ చిన్నగా నవ్వి ఊరుకున్నాడు వెంకయ్య.

"నిన్ను అనేదేముంది! లోకం పోకడే అంత!... ఆఁ... ఇంకా విశేషాలు ఏమిటి?" అనడిగాడు సూరయ్య.

"మగ పిల్లాడికి గుణం ప్రధానంకానీ, అంద మెందుకు?" అన్నాడు వెంకయ్య. ఆయన చెవుల్లో మునసబు మాటలే ప్రతిధ్వనిస్తున్నాయి.

"అది మనమీాద ఆధారపడి ఉంది. గుణంతోపాటు రూపంకూడ కావాలను కోవడం పొరపాటు కాదు. కాని, దుర

దృష్టవశాత్తు లోకం గుణం కంటే రూపానికే ప్రాధాన్యత ఇస్తోంది. అందుకే ఈ జీవితాలు గాలిపటాల్లా ఎటుగాలి వీస్తే అటే యెగురుతున్నాయి. ఎదురీదగల శక్తి కోల్పోయాయి" అన్నాడు సూరయ్య.

కొంచెం సేపుండి, "ఏమోనే బాబాయి. ఈయేడు కూడ ఆగటం యిష్టంలేదు." అన్నాడు వెంకయ్య.

"అలా అనుకుంటాంగానీ, మన చేతుల్లో వుందా? కళ్యాణం కలిసివస్తే ఆపగల శక్తే మనకు లేదు. కలిసి రాకపోతే చేయగలిగిందీ లేదు... అయినా అంత తొందరేమొచ్చిందిలే." అన్నాడు సూరయ్య.

"తిరిగి తిరిగి విసుగు పుట్టింది. అదీకాకుండా ఎప్పుడూ గడిచిందే మంచిగా కనపడుతోంది. క్రిందటేడు మనం ఖాయపరచుకుందామనుకున్న సంబంధం లక్ష్మీపురం షావుకారు సత్యం తన మూడో కూతురికి ఖాయపరచుకున్నాడు." అన్నాడు వెంకయ్య.

"మొన్నటి తగాయిదా ఏమైందిరా బాబు?" అంటూ సందర్భం మార్చాడు సూరయ్య. మరి ఆయన మనస్సులో ఏముందో?...

"ఏమీ కాలేదు. పోలీసుల చేతుల్లో పడ్డాక ఓ పట్టాన తేలుతుందా?..." ఓ నిట్టూర్పు విడిచాడు వెంకయ్య. "మనం అనుకునేది ఒకాటి, జరిగేది మరొకటి."

"మనం అనుకున్నదే ఎందుకు జరుగకూడదూ? నీవు కావాలంటే ఏ తగాయిదా లేకుండానూ చేయటానికి వీలుంటుంది!" అన్నాడాయన.

"అలా వుంటే అందరికీ హాయిగానే ఉంటుంది. కాని, ఎవరు ముందు బయట పడతారు?..."

"అబ్బాయి. ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఉన్న సమస్యల్ని పరిష్కరించుకొని, సుఖ జీవనానికి పునాదులు వేయటం మంచిది... నీవు ఎక్కడెక్కడో వెతుకుతావెందుకు? కుటుంబద్వేష్యం కొండుకు లేదూ?... అలా కలుస్తుంటే ఏగొడవా రాదుకదా. తరతరాలుగా వస్తున్న యీ వైరభావాన్ని ఎంత వరకని పెంచుకు పోవడం? దీనివల్ల ఒరిగే ప్రయోజనమేమిటి?"

వెంకయ్య దానికేమీ జవాబివ్వలేదు. తన మనసులోని మాట ఆయన కెలా తెలిసిందా, అని విస్తుపోయి చూస్తూ, ఉండిపోయాడు. తను తన మనస్సులోని మాటను ఎవరికీ చెప్పనే లేదే?" ఏమో ఆయన తన ధోరణిలో తానే అంటున్నాడేమో!... ఏమేమో ఆలోచిస్తూన్న వెంకయ్య సూరయ్యబాబాయి ఎప్పుడు వదిలాడో కూడ గమనించలేదు.

"మనం నిమిత్త మాత్రులం! యెప్పుడు ఏ క్షణాన ఏం జరుగుతుందో కూడ తెలుసుకోలేని అల్పులం!" అనుకున్నాడాయన తనలో తానే!

# 6

పల్లెలో జన్మించినా మంచీ చెడూ తెలుసుకోగల విచక్షణా జ్ఞానం కలిగినప్పటినించి బస్తీ వాతావరణంలో వుంటూ వచ్చిన రామారావుకి యిదంతా క్రొత్తగా వుంది. బస్తీ జీవితం అతనికి డొల్లగా కనిపించింది. ఎక్కడ చూచినా మోసమే! ఎవర్ని చూచినా స్వార్థమే! అక్కడ బ్రతుకే మోసమై మానవుడిని పీక్కు తింటోంది. ఇరుగు పొరుగని లేదు. ఇంటా బయటని లేదు. పక్కింటిలో పడుచువాడు చస్తుంటె 'అయ్యో పాపం!' అన్న పుణ్యాన పోరు!

అలాంటి వాతావరణంలో పెరిగిన రామారావుకి పల్లెటూరిని గురించి సదభిప్రాయముంది. ఇక్కడ ఒకరి కష్టసుఖాల్లో మరొకరు పాలుపంచుకుంటారని, ఒకరి కొకరు అండగా వుండి పల్లె వాతావరణాన్నే కాక, తమ జీవితాన్ని కూడ స్వర్గతుల్యంగా చేసుకుంటారని ... ఇంకా యిలాంటి వేమేమో అనుకున్నాడతడు.

కాని, తీరా వచ్చి చూస్తుంటె అతనికి పల్లె జీవితం చాల భయంకరంగా కనిపిస్తోంది. ఒకర్నొకరు నమ్మరు. ఒకరి బాగుని మరొకరు చూడలేరు. లేనిపోని తగాయిదాలు

కొని తెచ్చుకొని జీవితాన్ని మరింత గాఢాకరంగా చేసుకుంటారు. వారిలో కత్తు చిక్కుడు తీగలా అల్లుకుపోయినట్టుంది. అతడూహించిన జీవితం కాదుగదా, దాని ఛాయలైనా ఆ పరిసరాలలో కనిపించవు.

అతనికి ఊళ్ళో ఉండటమంటేనే కష్టంగా వుంది. తగువులతో, తన్నులాటలతో సతమతమాతున్న పల్లెటూరి వాళ్ళతో కలిసి మెలిసి తిరుగుతూ కాలక్షేపం చెయ్యడమంటె అతనికి బాధగానే వుంది. ఎవర్ని చూద్దామన్నా తమదే ఒప్పనీ, యితరులదే తప్పని చెప్పేవారే! ఎవరూ మనసిచ్చి మాట్లాడరు. అందరూ అనుమానించేవారే!

ఈ నాలుగురోజుల్లో ఒకాటివెంట మరొకాటి యెన్నో సంఘటనలు జరిగాయ్. వాటి లోతుపాతులు తెలుసుకుందామని వున్నా ఎవర్నడిగి తెలుసుకోవాలో బోధపడటంలేదు. తనతో చదువుకున్న కుర్రవాళ్ళెవరూ లేరు. తనకంటె చిన్నవాళ్ళు యెవ్వరూ తన దగ్గరకు రాలేరు పెద్దవాళ్ళ దగ్గరకు తాను వెళ్ళలేదు. చాల విచిత్రమైన పరిస్థితి!

ఏమీ తెలియని అయోమాయావస్థలో దారి తప్పిన పాంథునిలా! పుస్తక ప్రపంచంనుంచి ముక్తిపొంది షికారుకని బయలుదేరాడు. వాతావరణం చల్లబడింది. పిల్లగాలులు వీస్తున్నాయి. పగలంతా పొలంమీద స్వేచ్ఛగా మేసిన గొడ్లు ప్రొద్దుగూకేవేళకి మట్టులుదగరకు చేసుకుంటున్నాయి. అవి నెమరువేసుకుంటూ నిండుగా నడుస్తుంటె వయస్సు మళ్ళినవారు గతాన్ని నెమరవేసుకుంటున్నట్టేవుంది. వాటి కాళ్ల కడ్డం

పడుతున్న లేగదూడల చిల్లగంతులు చూస్తుంటె చిన్ననాటి చిలిపిచేష్టలు గుర్తొస్తున్నాయి.

రామారావు ఆ దృశ్యాన్నిచూచి ఒక్కసారిగా తన బాధను మరచేపోయాడు. అతడి హృదయం సంతోషంతో పులకరించింది, మనస్సు ఆనందంలో చిందులు తొక్కింది, అతడు తిన్నగా కొఠారిదగ్గర కెళ్ళాడు. అక్కడ వాల్చి వున్న నులక మంచంమీద చతికిలబడ్డాడు. కుటుంబయ్య మట్టుదగ్గర కూచోని గొడ్లను జాగ్రత్తగా కట్టించుతున్నాడు. ఊళ్ళో ముఠా తత్వాలు పెరిగిపోయి ఒహార్నొహరు తన్నుకోవటానికి సిద్ధపడుతున్నారు.

కొంతమంది కావాలని ఏదో గాలికబుర్లు చెప్పి తగాయిదాలు పెంచటానికి చూస్తారు. వాడి పెసరపొట్టు వీడు ఎత్తుకుపోయాడనో, వీడి పిల్లిమిసర వాడు దొంగతనంగా మేపుకున్నాడనో—ఇలాంటి వేమోమో చెప్పి స్పర్థలు మరింత పెంచుతుంటారు.

గత రాత్రి చిన్నపిల్లలు నాటకం వేసారు. దానిని ఆసరాగా చేసుకొని పొలంమీద కట్టేసిన గొడ్లతాళ్లు తెంపి నానా రభస చేసారు. అందువల్ల కుటుంబయ్య దగ్గరుండి గొడ్లను కట్టించుతున్నాడు.

రామారావుని చూచి—"చిన్నదొరగారు వచ్చారా!" అన్నాడు పాలేరు వెంకాయి.

కుటుంబయ్య ఒక్కసారి కొఠారివంకచూచి—"మంచం బయటవేసిరా!" అని కాసేపాగి, ఇవాళ గొడ్లను ప్రొద్దుపోయే వరకు మేపు" అన్నాడు.

వెంకాయి ఏమీ మాట్లాడలేదు.

"బాగా ప్రొద్దుకాడ లేచి ఊళ్ళోకి బండి కట్టుకురా! మరకెళ్ళాలి!" అన్నాడు కుటుంబయ్య.

"రేపు వామేద్దా మనుకున్నాంగా!" అన్నాడు వెంకాయ గేడెదూడను కట్టేస్తూ.

"కాదులే! ఇంట్లో బియ్యం లేవన్నారు." అన్నాడు కుటుంబయ్య—"సరే, నేను పోతున్నా! పెందరాళే వచ్చి గొడ్లదగ్గరే పడుకో, అటూ యిటూ తిరగక!"

"దొరగారూ! మీ పాలేరుది బియ్యం లేవంటోంది!"

"మొన్ననే గదరా! ఓ తూముడు తీసుకెళ్ళి. జాగ్రతగా వాడుకోమను. అయినా యీ గొడవేమిటి మాటి మాటికి రేపు ఒక్కసారే ఓ బస్తా తీసుకుపో!"

"వద్దులేండి దొరా! ఎన్ని తీసుకెళ్ళినా అవజేస్తుంది." నసిగాడు వెంకాయి.

"పెందరాళే వచ్చి గొడ్లదగ్గర పడుకో. అని హెచ్చరించి– "అబ్బాయిని పెందరాళే రమ్మని చెప్పు. పురుగూ పుట్రా ఉంటాయ్." అన్నాడు కుటుంబయ్య.

రామారావు పందిట్లో మంచం తీసి దూరంగా వేసుకున్నాడు. పడమటి దిక్కున సూర్యభగవానుడు తన బంగారాన్ని విరజిమ్మి కొండచాటున దాక్కున్నాడు. చల్లనిగాలి నిర్మలాకాశం!...

"ఏం బాబూ! ఇలా వచ్చావు?" సూరయ్య మాటలు విని లేచి కూచున్నాడు.

"ఏం లేదు తాతా! ఏమీ తోచిందికాదు. ఇలా వచ్చాను." అన్నాడు రామారావు. "ఇటురా తాతా! ఈ మంచంమీద కూచో."

సూరయ్య ఓ ప్రక్క చతికిలబడతూ, "బస్తీలో తిరిగిన వాళ్ళకి పల్లెలో యెలా తోస్తుంది?" అన్నాడు.

"చేసే పనిలేకపోతే ఎక్కడైనా కాలం గడవదు." అన్నాడు "ఏదోహా పనీపాటా వుంటే మనకు తెలియకుండానే కాలం దొర్లిపోతుంది. అస్తమిస్తున్న సూర్యునికీ, ఉదయిస్తున్న సూర్యుడికీ ఎంతో దూరం ఉండదు. ఏమిటి విశేషాలు. తాతా."

"నీకు తెలియని విసేషాలు ఏమున్నాయి బాబు?" సూరయ్య ఓ వేడి నిట్టూర్పు విడిచాడు— "పల్లెటూళ్ళిమధ్య పల్లెటూళ్ళుగా లేవు. ఇక్కడకూడ బస్తీపోకడలు కనిపిస్తు న్నాయి. తగవులు చంపుకొని కలసి మెలసి ఉండవలసిందిపోయి తగవులు పెంచుకోవటానికి ప్రయత్నిస్తారు. జీవితానికి విలువ లేనట్టు నికృష్టంగా తయారు చేసుకుంటున్నారు."

"దీని కంతటికీ కారణం ఏమిటంటావు?"

"ఏముంది బాబు! రైతుల బాధలే ఒక విధంగా కారణ మని చెప్పవచ్చు. బాధల్లో ఉన్నమనిషి మంచీ చెడూ తారతమ్యం తెలుసుకోలేని హీనస్థితిలో ఉంటాడు. పైగా, ప్రతిదీ తనకు అడ్డుగా నిలిచిందని వ్యతిరేకరిస్తూనే దానికి దాసోహం చెబుతాడు."

"దీనికంతటికీ అజ్ఞానం కారణమనుకుంటాను."

"అజ్ఞానం నీవు అనుకున్నంత చెడ్డదికాదు. పూర్వం అజ్ఞానంలోవున్న మనిషి అనుభవించిన ఆనందాన్ని ఇప్పుడు అనుభవించలేకపోతున్నాడు. కారణం తను తెలివిగలవాడ్నని, ఇతరులందరూ తెలివితక్కువ వారని అతని అభిప్రాయం. తను జ్ఞానమనుకొని నమ్ముతున్నది సంజీకటి. ఇంకా ఆ వెలుతురు కోసం కృషిచేయవలసింది. కాని, దానికే మిడిసిపడుతున్నాడు. దానికే ఉబ్బి తబ్బిబ్బవుతున్నాడు. ఈ దృష్టి మారినప్పుడే మనిషి తాను సుఖపడగలడు. ఇతరులను సుఖపెట్ట గలడు."

సూరయ్య కాసేపాగి— "తనకు లేదని ఇతరులకు ఉందని ఏడ్చినన్నాళ్లు మనిషి సుఖపడలేడు." అన్నాడు. "రా బాబు! చీకటి పడుతోంది. ఇంటికిపోదాం. మరీ చీకటి పడితే నీకు ఇబ్బంది అవుతుంది."

సూరయ్యతోపాటు రామారావుకూడ లేచాడు. కొంత దూరం వెళ్ళినాక— "మొన్నటి సంఘటన చూచావుగా. అందులో ఏ ఒక్కరిదీ తప్పులేదు. కాని, ఎవ్వరినీ రైటని చెప్పటానికి వీల్లేదు." అన్నాడు సూరయ్య.

అది విని రామారావు నిర్విణ్ణుడయ్యాడు. "అదేమిటి, తాతా! అలా అంటావు. తప్పంతా కామరాజుదేనని స్పష్టంగా కనబడుతుంటే?" అనడిగాడు అతడు.

"అదుగో. అక్కడే పొరపాటు పడుతున్నావు. దీనికి వెనుక ఏముందని ఆలోచించవు." అన్నాడు సూరయ్య, "రోజులు మారినప్పుడు మనమూ మారాలి. ఆస్తి హక్కు మగవాడితో

పాటు ఆడదానికికూడ వచ్చిందా? కాని, మనం దానిని గుర్తించ మామె.'' అన్నాడు.

ఆయనను మధ్యలోనే ఆపి "ఇందులో హక్కుల సమస్య ఏముంది తాతా. చిల్లి కజ్జాలు కనపడుతూంటే?'' అనడిగాడు రామారావు.

"రామయ్య తమ్ముడు చిన్నాడు చచ్చిపోయాడా? పిల్లలుకూడా లేరామె. ఆ అస్తినంతటినీ చేసుకున్న భార్య యెక్కడ తినిపోతుందోనని ఆవిడను రెండేళ్ళు తిండి తిన నిచ్చారా చివరికి విసుగుపుట్టి ఆవిడ పుట్టింటికి పోతుంటే వాళ్ళు వెళ్ల నిచ్చారా? ఆ స్తి అమ్ముకోనిచ్చారా? ఆ ఆడపడుచు కామ రాజుకి కొంచెం కావలసిన బంధువు కాగా! వాళ్లు ఏదో ధరకి మీరే తీసుకోండని వీళ్ళకి అంటగట్టి పోయారు. ఇహ అక్క డితో ఏమేమో గాలికబుర్లు లేవతీసి మా తమ్ముడి ఆస్తినంత టినీ వ్రాయించేసుకున్నాడని ఊరంతా గొడవ పెట్టారు. ఇహ ఆ తరువాత చెప్పుకోవటంకూడ సిగ్గుచేటు.''

ఇహ ఆ తరువాత వివరాలు అడగలేకపోయాడు రామారావు.

సూరయ్య— "ఈ ప్రపంచంలో మనకెంత బ్రతకటా నికి హక్కువుందో; ఇతరులకీ అంతే ఉందని అనుకుంటే ఏ వ్యవ హారము ఉండదు. అన్నిటినీ సరిపెట్టుకు పోతాము. అలా కాన ప్పుడు ఏ చిన్న తప్పుచేసినా దాని శిక్షమాత్రం కఠినంగానే

ఉంటుంది. దాని పర్యవసానంగా వచ్చే మంచీ చెడులకు తామే బాధ్యులమనుకోవాలి.” అన్నాడు.

రామారావు ఇహ మారు మాట్లాడలేక పోయాడు. ఊళ్ళోకి వచ్చేశారు. ముందు సూరయ్య యిల్లు వస్తే— “వెళ్లొస్తా తాతా!” అంటూ ముందుకుసాగాడు రామారావు.

# 7

రామారావు పెళ్ళి రాయబారాలు అతని మేనమామ ఊరు లక్ష్మీపురంవారితో సాగుతున్నాయి. ఆనాడు వారు అతనిని చూడటానికి వచ్చి, మంచిరోజు చూచి లగ్నం పెట్టుకుందామని అన్నారు. కాని; కుటుంబయ్య అందుకొప్పుకోలేదు. కుర్రవాడు పిల్లను చూచుకోవాలంటున్నాడని అందుకు సమ్మతించలేదు. సరే, అలాగే చూచిన తరువాతనే లగ్నం పెట్టుకుందామని వారు వెళ్ళిపోయారు. వారిని సాగనంపుతూ, కుర్రాడు యెప్పుడు వచ్చేదీ తరువాత తెలియచేస్తానన్నాడు కుటుంబయ్య.

ఆనాడు సాయంత్రం పిచ్చాపాటీ మాట్లాడుకున్న తరువాత కుటుంబయ్య యీ ప్రస్తావనే తీసుకొచ్చాడు తన చెల్లెలు రాజమ్మదగ్గర— "అమ్మాయి! ఇవాళ లక్ష్మీపురం వాళ్లు వచ్చారు. కట్నాలు కానుకలు సంగతి అలావుంచి మంచీ చెడూ చూచుకున్నా సంబంధం బాగానే ఉంది." అంటూ.

"మా వదిన ఏమంటోంది?" అనడిగింది రాజమ్మ.

"దానికి కూడ నచ్చినట్లే ఉంది. ఇంకా నాకే తేల కుండా ఉంది. ఊరంతా మంచిదికాదని వినకొడు తున్నాను" అన్నాడు కుటుంబయ్య.

"ఊరు నంచీ. చెడులు మన కెందుకులే! మనకు కావల సింది పిల్లా, కుటుంబం! అవి రెండూ బావున్నాయనుకుంటే ఖాయపరుచుకోవచ్చు" అంది రాజమ్మ.

"ఎక్కడున్నావే? అంటూ రామయ్య పెరట్లోకి వచ్చాడు. ఆయన కుటుంబయ్యను చూచి" యెవరో వచ్చా రటగా!" అన్నాడు.

"ఇప్పుడదే మాట చెబుతున్నాడు." అంది రాజమ్మ. "మీతో యెవరు అన్నారు?"

"నన్ను సూరయ్యబాబాయి అడిగాడు." ఏమో నాకు తెలియదే. అన్నాను. సంబంధం మంచిదేనటగా!" అన్నాడు రామయ్య పొయ్యిదగ్గర కెళ్లి చుట్ట ముట్టించుకుంటూ.

"ఆయన కెవరు చెప్పారో? మంచిదేనని" అంది రాజమ్మ అదోరహంగా మొహంపెట్టి.

"వాడి బావమరిది చెప్పాట్ట! వాడుకూడ వచ్చాడటగా" అన్నాడు రామయ్య.

"ఇవాళే వచ్చారు" అన్నాడు కుటుంబయ్య. "పదిహే నెకరాల భూమి ఉంది. ఒక్కకొడుకూ, ఒక కూతురూను కొద్దో గొప్పో డబ్బుకూడ ఉందట."

"వాళ్ళ కుంటే మన కొరిగిందేమిటి? యింతకీ ఏమిస్తా రంటావు?" అడిగాడు రామయ్య.

"ఐదెకరాలదాకా భూమి యిస్తారట! ఐదారు వేలు డబ్బుకూడ. భూములుకూడ మంచివే! ఎట్లాలేదన్నా ఎకరం నాలుగు వేలు చేస్తుంది." అన్నాడు కుటుంబయ్య.

"ఫర్వాలేదు. మంచీ మర్యాదాగల కుటుంబమైతే చేసు కోవచ్చు. ఖాయపరుసుకుంటే పోతుంది." అన్నాడు రామయ్య.

"అబ్బాయి వెళ్ళి చూచుకోకుండానే?" అంది రాజమ్మ.

"ఏం చూడకపోతే? యెర్రగా బుర్రగా ఉంటే సరిపో తుంది. మంచీ చెడూ వాళ్ళకేం తెలుస్తాయ్? ఇంకా అలా అన్నావు? ఎవరో ఇద్దరు పెద్దవాళ్లు వెళ్ళి చూచివస్తే బావుం టుంది. నీవు ఉండనే ఉన్నావుగదా! మీ వదినను తీసుకొని వెళ్ళిరా!" అన్నాడు. అంటూనే జవాబుకెదురు చూడకుండానే గొడ్ల చావిట్లో కెళ్లాడు.

కాసేపటివరకు యెవరూ మాట్లాడలేదు. కొద్ది క్షణాల తరువాత— "ఆయన పనికూడ అయిపోయింది." అంది రాజమ్మ.

"పొలం రావద్దంటే ఊరుకోడు." అన్నాడు కుటుం బయ్య— "అందులో ఈ కోర్టు యెద్దసి ఒకటి వచ్చిపడింది"

"ఆయన మాట ఆయనకేగాని, ఇంకొకరిమాట వినిపించుకునే పనిలేదు. వినిపించుకున్నా ఆలకించే అలవాటు అంతకంటే లేదు.

సుశీలవచ్చి మావయ్య వళ్లో కూచోని— "నాకు గాజులు చేయించవు మావయ్యా! వెంకయ్యబాబాయిగా రమ్మాయికి యెన్ని చేయించారనుకున్నావు?" అంది.

"అయితే నీకూ అన్ని చేయించమని మీ నాన్నను అడుగు!" అన్నాడు కుటుంబయ్య ముద్దుగా తల నిమురుతూ.

"మా నాన్న ఏం చేయించడు. నీవే చేయించు మావయ్యా!" అంది సుశీల తలతిప్పుతూ.

"అలాగే చేయిస్తా! వడ్లమ్మినాక నీకూ, సరోజక్కకు చేయిస్తా!" అన్నాడు ఆయన.

"సరోజక్కకు ఎందుకమ్మా? ఎందుకమ్మా! వాళ్ళు మావయ్య చేయించడా?" అంది బుంగమూతి పెట్టి.

"ఏమిటే? ఇప్పటినించే ఆడబిడ్డంటె అనురాగం చూపుతున్నావ్?" అంది తల్లి నవ్వుతూ.

"పో! అమ్మా! నీవు మరీను?" అంటూ ఇంట్లోకి పారిపోయింది సుశీల.

"పోనీ, దీనికూ వాడ పెళ్ళిలో పెళ్లి చేసేయిరాదురా?" అంది రాజమ్మ కూతుర్ని చూస్తూ నవ్వుతూ.

కుటుంబయ్య నవ్వి వూరుకున్నాడు. "కోర్టు వ్యవహారం ఏమైంది?" అనడిగాడు.

"రేపో ఎల్లుండో వాయిదా వుండట్టు వుంది. ప్లీడరుకి గుర్తుచేసి వస్తానని వెళ్ళి ఇప్పుడే వచ్చారు. అంది రాజమ్మ.

"వచ్చేవార మనుకుంటున్నానే ? ఈ వారంలో నేసా వాయిదా?" అన్నాడాయన.

"అతీపతీ లేకుండా ఇట్లా తిప్పుతారేమిటి? ఇంకా విచారణే ప్రారంభం కాలేదు. ఇంకా ఎంతకాలం తిరగాలోఏమో?" అందామె.

"మరి కోర్టు కెళ్ళాక, మన చేతుల్లో ఏముంది? వాళ్ళు కూచోమంటె కూచోవాలి. నుంచోమంటె నిలబడాలి. అంతకంటె చేయగలిగిందేముంద" అన్నాడాయన.

"ఇంతకీ ఏమౌతుందంటావు అన్నయ్యా" అనడిగింది రాజమ్మ.

"మనమెలా చెప్పగలం? చివరి నిముషంవరకు చెప్పలేం? అయినా, రాజీ పడితేనే పోతుంది" అన్నాడు కుటుంబయ్య.

"ఇలా డబ్బు తగలేసుకునేకంటె రాజీ పడితేనే పోతుంది. వాళ్ళూ తిన్నదిగాదు, మనమూ తిన్నదిగాదు." ఆమె కూడ ఆయన అభిప్రాయంతో ఏకీభవించింది.

"ఆయన ఏమంటున్నాడు ?"

"ఆయనకుకూడ అలాగనే వుంది. కాని, బయట పడటంలేదు."

"సరే, నేను వెళ్ళి వస్తానమ్మా! మళ్ళా ఏమంటాడో ఒకసారి అడిగిచూడు! మీ వదినకుకూడ అటే మొగ్గు వుండట్టు వుంది."

—అంటూ ఆయన యింట్లో కెళ్ళిపోయాడు.

"అమ్మాయి !" అంటూ రాజమ్మ లోనికెళ్ళింది.

# 8

ముందు వాకిట్లో ఎవరో పిలిచినట్టు వుంటె లక్ష్మమ్మ ముందుకొచ్చింది. "ఏమండోయి, దొరగారూ!" అంటూ కేక వేస్తున్నాడు ఎవరో.

"ఎవరారు?" వస్తూనే అడిగిందామె.

"నేనేనండి సూరయ్యగారి పాలేరుని." మా దొరగారు వున్నారా?" అనడిగాడు ఏసుపాదం.

"ఏమిరా ఏసుపాదం! దొడ్లో దూడ నిడుస్తున్నారా! ఏమిటి పని?"

"మా దొరగారు ఒకసారి రమ్మన్నారు" అన్నాడు ఏసుపాదం. "మా చిన్నదొరగారు ఏరండి? చూచి చాలనాళ్ళయింది."

"బయట కెళ్ళాడురా! నీ పిల్లలు బాగున్నారా!" అడిగిందామె.

"బాగానే వున్నారమ్మా! మా దొరగారి పెళ్ళి ఎప్పుడు చేస్తారు?" అడిగాడు వాడు.

"కలసి రా వద్దంటరా? మన చేతుల్లో నేవుందా? ఏమైనా యీ యేడు చేద్దామనే వుంది" అందామె.

"మా దొరగారికి చెప్పటం మరిచే పోతారా?" అన్నాడు వాడు.

"చెబుతా లేరా!" అంటూ లక్ష్మమ్మ పెరటి దొడ్లో కెళ్లింది. సూరయ్య బాబాయి రమ్మంటున్నాడట! ఇప్పుడే కబురు చేసాడు" అంది పాలచెంబు అందుకుంటూ.

"ఎందుకో?"

ఈ ప్రశ్న తనను కాదన్నట్టు లక్ష్మమ్మ వెళ్ళిపోయింది. కుటుంబయ్యకూడ సమాధాన మాశించకుండానే చుట్ట ముట్టించుకుంటానికని పొయ్యిదగ్గర కెళ్ళాడు.

"మీనాడు ఏం చెప్పాడు?" అడిగాడు పొయ్యిదగ్గర కూచొని చుట్టకు నిప్పు అంటించుకుంటూ.

"ఏడీ వచ్చాడు. ఆ ప్రక్క కెళ్ళాడు. సంబడితేనా? వాళ్ళు ఏదో ఒక మాట తేల్చమని గట్టిగా అడుగుతున్నారట! సరే, వెళ్ళి తెలుసుకొస్తానని చెప్పి వచ్చాట్ట! మనం కూచున్నామని వాళ్ళుకూడ కూచుంటారా? ఆడపిల్లవాళ్ళు!" అంది లక్ష్మమ్మ పాల కుంపట్లో నిప్పు వేస్తూ.

కుటుంబయ్య ఏమీ మాట్లాడలేదు.

"మీకు ఎంతకీ చీమకుట్టదాయె! నూతిలో భద్రయ్య చూడండి! ఇట్టే చేసేసాడు" అందామె మళ్ళీ.

"మనం తొందరపడితే పనులౌతాయా, కాలం కలసి రావద్దూ? అది కలసి రాకపోతే మనం ఎన్నుకున్నా, ఏమను

కున్నా ప్రయోజనం లేదు. అయినా నేనుమాత్రం కూచుంది ఎక్కడ ?"

"అది సరేగాని, వెంకయ్యగా రమ్మాయిని ఇస్తారటగా చేసుకోరాదు ?" అంది లక్ష్మమ్మ.

కుటుంబయ్య దగ్గరకు ఈ వార్త రాలేక పోలేదు. అయినా ఏమీ తెలియనట్టే—"ఎవరన్నారు నీతో ?" అన్నాడు ఇష్టంలేని ధోరణిలో.

"ఎవరనట మేమిటి, ఊరంతా కోడై కూస్తుంటే ! నీకూ నాకు తెలియదేమో ! అందరూ అనుకుంటున్నారు."

"అంతేగాని, నీదాకా రాయబారం రాలేదుకదా ! అయినా ఎవరనుకుంటూ వుండగా విన్నావు."

"ఇందాక రత్తమ్మపిన్ని వచ్చింది. సూరయ్యబాబాయి ఆయన అనుకుంటూంటే విన్నదట! అందుకేనేమో, ఇప్పుడు పిలిపించినది ?"అని ఆమె అంటూండగానే కుటుంబయ్య బయట కెళ్ళిపోయాడు. మిమ్మల్నే ! సూరయ్యబాబాయి పిలిచాడు. వెళ్ళి రండి !" అంది గట్టిగా.

కాని, ఆయన ఆమె మాట వినిపించుకున్నట్టులేదు. అప్పటికే బజార్లోకి వెళ్ళిపోయాడు.

మానవుని మనస్తత్వం చాల విచిత్రమైనది అవసరమైతే ఇట్టే సమాధానపడుతుంది. లేకపోతే సంఘర్షణకు దారి తీస్తుంది. అది ఎప్పుడు ఏరూపంలో బహిర్గతి మౌతుందో ఇతరులకు తెలియనుగదా ! ఇతరులదాకా ఎందుకు ? తనకు

కూడ తెలియదేమో! తెలిస్తే ఆ మార్పుని బయట పడకుండా చూడదూ!

లక్ష్మమ్మ మనసులో వచ్చిన మార్పుకూడ అలాంటిదే! నిన్న మొన్నటివరకు ఏపొత్తూ లేని వెంకయ్యతో వియ్యం చేయటం ఆమె అనుకోకుండానే అభిలషిస్తోంది. ఏం చూసో తెలియదు? అప్పుడు వెంకయ్య ఆస్తిపరుడే! ఒక్కతే కూతురు. ఆ ఆస్తి ఆమెను అలా కదిలించి వుంటుంది. ఆర్థికంగా లాభం వుంటె ప్రతి మనిషి త్వరగా రాజీకి దిగుతాడు.

కుటుంబయ్య మనసులో ఆమె మాటను కాదనగల శక్తి లేకపోయినా, అభిమానంకొద్దీ కోపం తెచ్చుకొన్నాడు. ఆయన మనస్సులో ఓ ప్రక్క స్వార్థం తాండవ నృత్యం చేస్తుంటె, మరొకప్రక్క అభిమానం సింహగర్జన చేస్తోంది.

ఆ అభిమానంకొద్దీ రుసరుస లాడుతూ చెప్పులు తొడుక్కోవటం కూడ మరచాడు. మేకులా కొనతేలిన మట్టి గడ్డ గుచ్చుకొనేప్పటికి చెప్పుల సంగతి గుర్తుకొచ్చింది.

"అవును. నిజమే! వెంకయ్య కూతుర్ని చేసుకుంటె బాగానే వుంటుంది" అనుకున్నాడు తనలో తానే. మరో క్షణం లోనే "ఛీ! అదేమిటి? అలా అనుకున్నాను. మనకీ వాళ్ళకీ పొత్తేమిటి? ఏనాటినించో లేనిదానికి ఇవాళ ప్రాకులాడటం మంచిదికాదు" అనుకుంటూ మనస్సులో చీదరించు కున్నాడు.

నాలుగడుగులు వేసాడో లేదో, "వెంకయ్య మంచి వాడు" అనుకున్నాడు. పాతగోతులు త్రవ్వుకుంటూ కూచుంటే

ప్రయోజనమేమిటి" అనుకుంటూనే ఒక అగుగు వెనక్కేసాడు. అంతెసులు తీసేస్తే పోతాయా ! వాళ్లు వాళ్లే ! మనం మనమే ! మనకీ వాళ్ళకీ పొత్తెక్కడ?"

"మంచి ఆస్తి" అనుకున్నాడు మళ్లీ కుటుంబయ్య— "మనకీ వాళ్ళకీ రాజీ ఎలా కుదురుతుంది ? సంబంధాలు ఎలా ఏర్పడతాయి కోర్టు వ్యవహారాలుకూడ వచ్చి పడే?"

"ఎవరాను?" అని ఎవరో పిలిచేప్పటికి మళ్ళీ యీ లోకంలో పడ్డాడు. ఏదో తప్పు చేసినవానిలా తబ్బిబ్బయి పోయాడు" సూరయ్య మామా!" అన్నాడు తనకు తెలియకుండానే.

"ఏమిటిరా బాబు ! ఎక్కడకు బయలుదేరావు?"— అనడిగాడు సూరయ్య.

"పొద్దున చూచి వద్దామని బయలుదేరా ! ఇవాళ పొలం పోయి రావటానికే తీరిక లేకపోయింది" — అన్నాడు కుటుంబయ్య.

"ఏం, ఒహ పూటకి వెళ్ళకపోతే!" అన్నాడు సూరయ్య "రా! ఇక్కడ కూచుందాం !"

"కేసునుగురించి నీ అభిప్రాయ మేమిటి మామా!" అన్నాడు కుటుంబయ్య.

"బహుశా ! కేసు కొట్టేస్తాడేమో ననుకుంటున్నాను !" అన్నాడు సూరయ్య "ఈసారి ముద్దాయిలందర్నీ రమ్మన్నాడట!"

"అందుకే శిక్షలు పడతాయేమోనని భయపడు తున్నారు" అన్నారు కుటుంబయ్య.

"నాకుమాత్రం రాజీపడితే బావుంటుందని వుందబ్బాయి" అన్నాడు సూరయ్య.

"రాజీ! రాజీ రెండు పక్షాలవారు కోరితేగాని సాధ్య పడదుగదా! అందరూ అనుకుంటేనే సాధ్యపడుతుంది" అన్నాడు కుటుంబయ్య.

"వాళ్లూ అందుకు సుముఖంగానే వున్నారు. మనవాళ్లు కూడ అదే అభిప్రాయంలో వున్నట్టు కనపడుతున్నారు. ఈ వాయిదాలోపలే మనం ఒకచోట కూచుంటే పోతుంది."

"అలాగే చేయి నీవు చేస్తానంటె నేను కాదంటానా?"

"అలా అనే నేను నీకు కబురుచేసాను. నీకు కబురు అందనే లేదా ?"

"ఇంట్లో చెప్పినట్టున్నారే! నేనే ఏదో గొడవలోపడి మరచాను. అయితే, ఇప్పుడే వచ్చేస్తా" అంటూ కుటుంబయ్య గబగబా వెళ్ళిపోయాడు తత్తరపడుతూ.

"ఎప్పుడూ లేని యీ తత్తరపాటు ఏమిటబ్బా !" అను కున్నాడు సూరయ్య.

నాలుగడుగులు వేసాడో లేదో, కుటుంబయ్య వెనక్కు తిరిగాడు. ఆయన మెదడులో ఏదో గాలిదుమారం లేచింది. ఆ

గాలిదుమారంలోనే కొట్టుకుపోతున్నాడు. మనస్సు మనస్సులో లేదు. తన ఆలోచనల్లో కొట్టుకుపోతూ "అవును, రాజీ కుదిరితే బాగానే వుంటుంది." అనుకున్నాడాయన తనలో తానే మరొక్కసారి.



## 9

బావమరిదికి ఏం చెప్పాలో తెలియక కుటుంబయ్య ఆ రోజంతా చికాకు పడ్డాడు. ఆ సంబంధం బావుందని మనస్సు చెబుతున్నా, అంతరంగం ఒప్పుకోవటంలేదు. నిన్నా మొన్నటి వరకు మంచి సంబంధమని సమాధాన పరుచుకున్నా ఇప్పుడెందుకనో అసంతృప్తిగానే వుంది. అవును మరి! ఎలా నచ్చుతుంది? దృష్టి వేరొకచోట వుంటే!

వివాహంలో ఇతరుల జోక్య ముండకూడదని పాశ్చాత్యులు సిద్ధాంతీకరించినా, మనం దానిని స్వీకరించలేపోతున్నాం. మన సాంఘిక కట్టుబాట్లు అలాంటివి. అలా అని మనం మన దారిని పోతున్నామా? లేదు. అనుకరించగల శక్తియుక్తులు లేకపోయినా ప్రయత్నం మాత్రం వదులుకోలేదు.

భార్య చెప్పినప్పుడు మొదట్లో కస్సుమన్నాడు. కాని, ఆమర్నాడు ప్రొద్దునే ఆవిడ వంటింట్లో కూచొని కూరగాయలు కోసుకుంటూంటె చుట్ట ముట్టించుకోవటానికి వెళ్ళి "రత్తమ్మత్త ఏమందే?'' అన్నాడు నెమ్మదిగా, ఏదో తప్పుచేస్తున్నవానిలా భయపడుతూ.

కాని, లక్ష్మమ్మ ఏం సమాధానం యివ్వక పోయేప్పటికి ముందు కోపం వచ్చినా, తరువాత వాస్తవం తెలుసుకున్నాడు. తననోటినుండి పైకి పెకిలిరాందే?'' ఏదో తప్పుచేస్తున్నవానిలా కంగారు పడిపోతున్నాడు. ఏమో అడగాలని ప్రయత్నిస్తున్నాడు. కాని, నోటిమాట పెగలటంలేదు. ఇంతలో లక్ష్మమ్మ "ఏమండి, మరి ఏమాలోచించారు?'' అనడిగింది.

కుటుంబయ్య తత్తరపడుతూ "ఏమిటాలోచించటం? వాళ్ళు మనదగ్గరకు రాందే మనం ఆలోచించుకోవటమేమిటి?'' అన్నాడు తన ఆలోచనా ధోరణిలో.

"వాళ్ళు రాకపోవట మేమిటండీ? అబ్బాయి — వెళ్ళిపోతా నంటున్నాడు. వాడి కేమైనా సమాధానం చెప్పటం పోయి, వాళ్లు మనదగ్గరకు రాలేదంటారు. మీా కేమైనా మతిపోయిందా?'' అంది లక్ష్మమ్మ చేతిలో పని ఆపేసి.

"అదా? ఆ సంగతి నే మరచేపోయా. ఊఁ అప్పుడే తొందరేముంది? రెండు రోజులు ఆగితే, అబ్బాయికూడ వస్తాడాయె వాడు వచ్చినతరువాత చెప్పి పంపుదాం!'' అన్నాడు, మళ్ళా యీా లోకంలోకి వచ్చాడు.

"అగ్గి భయాలు! ఎన్ని రోజులని కూచుంటాడు?"

"అబ్బాయి లేందే మనం మాత్రం ఏం చెబుతాం? వాడిని రానీయ్, వాడు ఏం చెబుతాడో చూద్దాం? వాడికి నచ్చిన తరువాత వెళతాడులే! ఇంతలో ఏం కొంపలు మునిగిపోతాయ్!"

"మీరు అలాగే అంటూ వుంటారు. మునిగేవరకు మాట్లాడరు. వాడూ, ఇవాళో, రేపో ఉద్యోగానికి పోతాడు. మళ్ళీ యీ యేడుకూడ అలాగే పోతుంది."

"ఆ భయమేం అవసరంలేదు. ఈ యేడు చేద్దాంగా! తొందరపడితే పనులౌతాయా?"

"మీరు అలాగే చెబుతారు? మీరుమాత్రం తొందరపడలేదు?" అందామె "మీరు ఏం చేసిపోయారు? బాబు మీ మాట కాదంటాడా?"

"ఆ కాలం వేరు, ఈ కాలం వేరు. అంతా మనలాగే వుంటారా? కాలంతో పాటు మనమూ మారాలి. ఈ రోజుల్లో పిల్లలతో సంప్రదించకుండా మనం ఏమీ చేయకూడదు."

"పోనీ ఓ మాట చెప్పండి. వాడు ఎలాగూ మామయ్యగారింటికెళ్ళి రావాలంటున్నాడు. ఓ నాలుగురోజులలో వస్తాడని చెబుతా!"

"అలా చెప్పావంటె కొంపతీస్తావు. వాళ్లు ఖాయమనుకునే ధోరణిలో వుంటారు. అయినా, ఎందుకు? రెండు రోజులు ఆగమను. ఇద్దరూ కలసి పోతాం." అన్నాడు కుటుంబయ్య "నీవు త్వరగా వంటచేయి నాకు పనివుంది. అలా కాసేపు సూరయ్యమామ యింటిదాకా వెళ్ళి వస్తా!"

"రాత్రంతా కూచున్నా ఏమీా తెమలలేదా ?"

"ఎలా తెములుతుంది? ఎక్కిరించేవాళ్ళు కొందరుంటె, ఎగతాళి చేసేవారు కొందరట! మునసబు, నూరయ్యమాంవ, షావుకారు. ఈ ముగ్గురు ఎలా చెబితే అలా నడుచుకోవడమనీ అనుకున్నారు, నాకెందుకొచ్చింది నేనుండను" అన్నాడు మున సబు, ఇంకా రాజీ ఎలా కుదురుతుంది ?"

"ఆయనకు కావలసింది తగాయిదాలను పెంచటం. ఇంకా, రాజీ ఎలా కుదుర్చుతాడు ?" అందామె.

"అది సరేగానీ, వెంకయ్యగారి వాళ్ల మ్మాయిని మన వాడికి యివ్వాలని గట్టిగా వుందట! చేసుకుంటె బాగానే వుండేట్టు వుంది" అని ఆగిపోయాడు, ఎవరో వస్తున్న చప్పుడు విని.

"కూరగాయలు ఏం చేస్తున్నావు అమ్మాయి!" అంటూ కామాక్షమ్మ లోనికి వచ్చింది. ఆమెను చూచి కుటుంబయ్య కూడ బయట కెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళటంచూచి, ఆమె కూడ మెదలకుండా వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది.

లక్ష్మమ్మ ఆమెను పిలుద్దామని కూడ అనుకోలేదు. ఆమెను గమనించనట్టె ఊరుకుంది, "ఛీ పాడుముండ! ఎప్పుడూ యింటిమీాదకి ఎగబడుతూ వుంటుంది" అనుకుంది తనలో తానే.

మొన్న శారదను చూచినప్పటినించి ఆమెకు కూడ అదోరకమైన ఆప్యాయత ఏర్పడింది. చక్కనైన వాళ్ళను

చూస్తే ఎవరైనా అలాగే అనుకుంటారేమో! అందులో అప్పటికే ఊరంతా అనుకుంటూనే వున్నారు. కుటుంబయ్య పెద్దకోడలు వెంకయ్య కూతు రేసని. నిప్పులేందే పొగవస్తుందా? వారికి ఆ అభిప్రాయంలేందే ఆ మాటలుమాత్రం ఎలావస్తాయి?

ఆ సాయంత్రం ఏదో పనిమీద వచ్చిన రత్తమ్మ కూడ అదే సంగతి చెప్పింది, అప్పుడామె దగ్గర ఏమీ అనలేకపోయినా మనస్సులోమాత్రం అలా జరిగితే బాగానే వుండుననిపించింది.

రత్తమ్మత్తకూడ దానిని బలపరినట్టు "దూరపుకొండలు నున్నగా వుంటాయి. దగ్గరకు వెళితేగాని తెలియదు వాటి బాగోగులు" అంది. అప్పుడు తానుకూడ అవుననుకుంది.

కాని...కాని, నిన్న ఆమాట బయట పెట్టగానే ఆయన కస్సుమనటం చూచి 'ఛీ! ఇదంతా నా పిచ్చిగానీ! ఎలా సాధ్య పడుతుంది, ఈ వాతావరణంలో' అనుకుంది.

కాని, ఇవాళ ఆయనే స్వయంగా ప్రస్తావన దెచ్చేప్పటికి ఎందుకనో ఆమె మనస్సు సంతోషంతో పులకరించింది. ఈ మగవాళ్ళుకూడ విచిత్రమైనవాళ్ళు ఏదైనా మనం అంటె కస్సుమంటారు. అదే వాళ్ళంతట వాళ్ళే అంటె ఏ గొడవా వుండదు. అనుకుంది తనలో తానే. ఇదే అదుననుకొని ఏమేమో చెప్పాలని అనుకుంది. కాని, ఏమీ చెప్పలేక పోయింది. కామాక్షమ్మ వచ్చేప్పటికి ఆమె అందుకే అంత మండిపడింది.

"ఏమో! మనం అనుకున్నంతమాత్రాన సరిపోతుందా? విధి లిఖితం వుండొద్దూ? ఏదెక్కడ అవ్వాలని వుంటె అక్కడే

అవుతుంది. మనం కాదనుకున్నా ఆగదు'' అనుకున్న దామె తనలో తానే మరొక్క-సారి.

దూరాన ఎవరో మంగళహారతులు పాడుతున్నట్టున్నారు. ఎవరు చెప్మా? ... ఓహో, అదంతా తన మనస్సులోనే ... కాదు, కాదు తన మెదడులో...

# 10

కొన్ని రోజులు గడిచిపోయాయి. ఒక్కో-సారి మనకు తెలియకుండానే కాలం గడిచిపోతుంది. ఆ కాలగమనాన్ని చూచికూడ చూడనట్టే ఉండిపోతాం. మరొక్కో-సారి కాలం చాల బరువుగా, భారంగా రోడ్డు రోలరులా ఎంతో బలవం తాన గడుస్తుంది!...

జీవితాలు కూడ అంతేనేమో! ఒక్కో- జీవితం తామరాకు మీాది నీటిబుడగలా నిర్లిప్తంగా అన్నిటిలోనూ ఉంటూ ఏదీ పట్టకుండా సాగిపోతుంది. మరి ఒక్కో- జీవితం యెంత దూరంగా ఉందామన్నా ఉండనీయదు. అన్నిటిలోనూ మునిగి తేలుతూ ఉంటుంది, అలాటి జీవితానికి నిష్కృతిఅంటూ

ఉండదు. భగవంతుడు అలాంటిది కల్పించాలనా కల్పించ లేడేమో...

కాని...కాని కొందరి జీవితం ఈ రెండురకాల మన స్తత్వాన్ని పోలివుంటుంది. వారు ఏ సంగతీ పట్టించుకున్నట్లు ఉండరు. కాని, దేనికీ దూరంగానూ ఉండలేరు. అలాంటి జీవితమే సూరయ్య జీవితం కూడాను. ఆయనకు పట్టని సంగతంటూ లేదు. అలా అని ప్రతిదాంట్లో కలుగచేసుకొని జీవితాన్ని కలుషితం చేసుకునేది లేదు. ఉన్నదాంతో తృప్తిగా బ్రతుకుతూ ఇతరులుకూడ అలాగే బ్రతకాలని కోరుకునే మనిషి. అందుకే ఆయనను యెవరూ కాదనలేరు...

ఆనాళ సాక్ష్యం అలా చెప్పాడని మానస్సులోవున్నా ఆయనను కాదనగల శక్తి రామయ్యకి కూడ లేదు. ఆయన ఏది చేసినా, ఏం చెప్పినా సదుద్దేశ్యంతోనే చేస్తాడని అందరి విశ్వాసం. అందువల్లనే ఆయన ఆత్మీయుల్లో ఆత్మీయుడు...

ఓ రోజున సూరయ్య "రామయ్యా నా మనస్సులో ఒహాటుందిరా! అలా జరిపితే బావుంటుంది." అన్నాడు. ఏదో మాటల ధోరణిలో.

"ఏమిటది?"

"మన కుటుంబయ్య కొడుక్కి- వూళ్ళో సంబంధం బావుంటుంది" అన్నాడు ముక్తసరిగా ఆయన.

"ఊళ్ళో సంబంధమేది?" అడిగాడు రామయ్య తనకు తెలిసినంత వరకు ఎక్కడా లేదన్న ధోరణిలో.

"వెంకయ్య కూతురు సంగతి నేను మాట్లాడుతున్నాను" అన్నాడాయన.

రామయ్య ఏమీ మాట్లాడలేక పోయాడు. ఆయన యెందుకు మాట్లాడలేకపోయాడో చెప్పటం కష్టం.

"ఆస్తికి ఆస్తీ ఉంది. అందులో తెలిసిన వాళ్లు!" అన్నాడాయన మళ్లీ. ఇంతలో రామయ్య ఆపి- "వాళ్ళ కుండొద్దంటా? నీకూ నాకూ ఉంటే సరిపోతుందా?" అనడిగాడు.

"వాళ్ళకు కూడా ఆ అభిప్రాయం ఉండట్టే కనపడు తుంది."

"యెలా అనుకోవడం?" వెంకయ్య యీ విషయం సూరయ్యతో చెప్పివుండకపోతే యీ ప్రస్తావన తీసుకురాడని రామయ్యకు గట్టి నమ్మకం.

"నేను చెబుతున్నాగా! అలా అని ఉంది! అదిమాత్రం ఖాయం. కుటుంబయ్య ఏమంటాడో అని..."

"నీ మాట కాదంటాడా ఏమిటి? ఒకసారి చెప్పి చూడు! నేనుకూడ అంటాను" అన్నాడు రామయ్య. ఆ రోజు సాయంత్రమే "వెంకయ్య కూతుర్ని మనవాడికి యివ్వాలని ఉందట!" అన్నాడు తన భార్యతో.

"ఎవరన్నారు?" అనడిగింది పొయ్యిమీద కుండ నెక్కిస్తూ "గాలి వార్తలు చాల వింటున్నాం" వాటిలో నిజా నిజాలు ఎంతవరకో?"

"నూరయ్యబాబాయి అలాంటి మనిషి కాదుసుమా! ఆయనే అన్నాడు. నేనేం చెప్పను? బాగానే ఉంటుందన్నా!" అన్నాడు రామయ్య.

"బోలెడు ఆస్తి" అన్నాడు కాసేపుండి.

"ఒక్కగానా ఒక్క కూతురు!"

"మనవాడు చేసుకోవద్దూ?"

"మీరు చెప్పండి. మీమాట యెప్పుడు కాదన్నాడు?"

"చక్కగా కష్టపడి చదువుకున్నాడు."

"నిన్న మీ మరదలుకూడ అలాగేఅంటోంది"

"ఏమని?"

"మన అమ్మాయి పెద్దబ్బాయికిస్తే బావుంటుందని"

"చిన్నాడు తీసేసి వున్నాడా"

"కష్టపడి చదవొద్దూ?"

"చదువుకోకపోతే మానే. ఇంటిదగ్గరే ఉంటాడు. వాళ్ళకి తిండికి చాలదంటావా?" ఇక్కడ ఎలాగూ ఒక మనిషి అవసరం."

"నాకూ అలాగేనని ఉంది." చిన్నాడికే ఇద్దామని మొదటినుంచీ ఉంది అన్నాను. అలా అంటూంటే ఆమె మనస్సు ఎందుకో బాధపడుతోంది. ఏదైనా అవకాశం దొరికితే దానిని జారవిడవడం మనిషికి ఇష్టముండదు.

రాజమ్మకు కూడ యెందుకనో మనసులో ఏమో కెలుకుతున్నట్టు బాధగా ఉంది. ఆడపిల్ల ఎంతలో పెరుగుతుందని ఆమె లోలోనే తర్కించుకుంటూ ఉంటుంది. కాని,

మరో క్షణంలోనే సమాధాన పరచుకొని మనస్సుని గట్టిపరచు కుంటుంది.

"చిన్నబ్బాయికి చేసుకొని మన యింట్లోనే పెట్టుకుంటే బావుంటుంది." అంది ఏదో తనను తానే సమాధాన పరచు కోవటానికి ప్రయత్నిస్తున్న ధోరణిలో.

ఇంతలో ఎవరో పిలిచినట్టు వుంటే రామయ్య బయట కెళ్ళాడు. "మునసబువచ్చినట్టున్నాడు." అంటూ.

"అయ్యో! నా తెలివి తెల్లార. ఎసట్లో బియ్యమేయ టమే మరచాను." అంటూ చేటపుచ్చుకొని ఇంట్లోకెళ్ళింది. ఎసట్లో నీరు తుకతుక ఉడికిపోతున్నాయి.

# 11

ఊరంతా ఒక్కసారి గప్పుమంది. వెంకయ్య కూతుర్ని తన కొడుక్కి చేసుకోవటానికి కుటుంబయ్య రాజీకి ప్రాకులా డాడని. ఈ వ్యవహారంలో నూరయ్యకూడ ముఖ్యమైన పాత్ర వహించాడని మునసబు నల్గురికీ చెప్పాడు. రామయ్య తన

కూతుర్ని పెద్దమేనల్లుడికే యివ్వాలనుకుంటున్నాడని, కాని, కుటుంబయ్య అంగీకరించలేదని కారణం, పెద్దవాడు ఎలాగూ చదువుకున్నాడు మంచి కట్నం వస్తోంది. చిన్నవాడు చదువు కోక పోయినా మేనరికం వల్ల మంచి ఆస్తి సంపాయిస్తాడు... ఇంకా యిలాంటి వేమేమో చెప్పుకుంటున్నారు... ఇందులో నిజా నిజా లేమిటో మనకు తెలియదు...

ఓ రోజున బాలయ్య అన్న దగ్గరకొచ్చి- "నీవు అంతగా ప్రాధేయ పడటం దేనికి? మనకు తగిన సంబంధం మనకు ఉంటుంది, అయినా నీవు అనుకోవటంగానీ, ఇంతకంటె మంచి సంబంధం మనకు రాదంటావా? ఆ పరిస్థితిలో మనం వాళ్ళ చుట్టూ తిరగటం దేనికి? నల్గురి నోళ్ళలో పడటం దేనికి?" అన్నాడు.

"ఏఁవిటిరా, నీవు చెప్పేది? నా కర్థం కావటం లేదు. స్పష్టంగా చెప్పు" అన్నాడు రామయ్య.

"నేనా చెప్పడం దేనికి? ఊరంతా కోడై కూస్తోంటే నీవు కుటుంబయ్య కాళ్ళు పట్టుకున్నావు. అప్పుడుకూడ ఆయన నీమాటను కాదన్నాడని అందరూ అనుకోవడంలా!"

"నేను ప్రాధేయపడ్డానని ఎవరు అన్నారు? ఇలాగే ఉంటాయి పుకార్లంటే! అసలు అభిప్రాయమే లేందే?"

"అలాంటప్పుడు అంతా యిలా ఎందు కనుకుంటారు? రవ్వలేనిదే నిప్పు ఎలా వస్తుంది? పైగా మాదగ్గరకూడ ఎందుకు దాస్తారు?"

"నీతో ఎవరన్నారు?"

"ఎవరంటె ఏం? అసలు నీవు అడిగావా లేదా?"

అడిగాను...అడగటం ఏముంది? ఏదో మాటల సందర్భంలో మీ వదిన అంది, అలా చేస్తే ఎలా వుంటుందని? చివరకు బావుండ దనుకున్నాం! అయిపోయింది. దానికి ఇంత రభస ఎందుకు?

"మేము అనుకుంటూనేవున్నాం మాతో ఏమీ చెప్పవని. నల్గురికీ తెలిసిన తరువాతనేగదా మాకూ తెలిసేది? ఇంతకీ మేము సవతితల్లి బిడ్డలమనేగా?"

ఈ మాటలు వినేప్పటికి రామయ్య మనస్సు చివుక్కుమంది. ఈ పాతికయేళ్ళనించీ అలాంటి మాట రాకూడదని, ఎంతో ప్రయత్నించాను. తను పెంచి పెద్దవాణ్ణిచేసి తమ్ముళ్ళిద్దరికీ పెళ్ళి చేసాడు. ఆ తరువాతకూడ ఇతరులు ఎక్కడ ఏమనుకుంటారోనని భయంతో తమ్ముళ్ళు ఏం తప్పు చేసినా సరిపెట్టుకు పోయాడు. ఇంకా వాళ్ళను గురించి తను ఎన్ని బాధలు పడిందీ, తనకు తెలుసు చచ్చిపోయిన తన భార్యకు తెలుసు...

ఆపాత కథలు జ్ఞాపకమొచ్చి కంట తడిపెట్టుకున్నాడు. అయినా, ఈ రోజున తన తమ్ముడు అననే అన్నాడు. నేను సవతితల్లి బిడ్డనని వేరుచేస్తున్నావని...

బాలయ్య తన ధోరణిలో "నీవు మంచివాడి వయితే ఇన్ని మాటలు ఎందుకు పడాల్సి వస్తుంది? ఇన్ని కూతలు ఎందుకు కూయించుకోవాల్సి వస్తుంది" అన్నాడు.

రామయ్య "నేను మంచివాడిని కాదని నల్గురూ అనుకుంటె సరిపోతుందా? ఇహ వెళ్లు! ఈ వ్యవహారంలో నీవేం జోక్యం చేసుకోకు!" అన్నాడు గట్టిగా, "ఎవడో చెప్పాడు మాటలు విని నీ యిష్టం వచ్చినట్టు మాట్లాడతావు. నాకు తెలియని మంచీ చెడూ నీకు తెలిసాయేంవిటి?"

"నీ ఇష్టమొచ్చినట్టు చేసుకో" బాలయ్య రుసరుస లాడుతూ వెళ్ళిపోయాడు. "వాళ్ళు తప్ప నీ కందరూ చెడ్డ వాళ్ళేగా!" అంటూ.

బాలయ్య వెళ్ళిపోయాడు. కాని, పోతూపోతూ ఆయన మనస్సులో ఓ అగ్నిగోళాన్ని రగుల్చోల్పి పోయాడు. అవును, మరి నిజమే! అతడు అన్న మాటల్లో వాస్తవం లేకపోలేదు. ఆయన తమ్ముడికంటె బావమరిదితో బాగువుంటాడు. ఏ వ్యవహారం వచ్చినా ముందు ఆయనతోనే సంప్రదిస్తాడు. తన తమ్ముణ్ణి సంప్రదించాలన్న అవసరం ఆయనకు కనిపించ లేదు. కాని, అది ఒక తప్పుకాదే?...ఆ కుటుంబానికీ, యీ కుటుంబానికీ అలాంటి సంబంధాలు ఎప్పటినించో వున్నాయి. మూడు తరాలనించి ఇచ్చి పుచ్చుకోవటాలు వున్నాయి. తన తండ్రి కుటుంబయ్య తండ్రి మేనత్త మేనమామ బిడ్డలు. అదీ యిదీ ఒకే కుటుంబంగా పరిగణింపబడుతూ వుండేది.

ఇటీవల కొంత కాలం పెళ్ళిళ్ళ వ్యవహారాలలో మన స్పర్థలు రావడం, కొంచెం దూరమవడం జరిగింది.

కాని, ... కాని, ఇప్పుడు అలాంటి సమస్యలు లేవే ? తన తండ్రి, ఆ వెంటనే భార్య పోయింది. అప్పుడు మరల రెండు కుటుంబాలు దగ్గరకు వచ్చాయి. కలతలు కలకాలం వుండవు. వుండేవి మమతలే ! అంధకార మయమైన జీవితంలో మళ్ళా వెలుగును చూపి ఆశను రేకెత్తించింది, ఆయనేకదా !

తనకు మాతృదయం లభించలేదు. చిన్నతనంలోనే ఆమె చనిపోయింది. మరల భార్య పోయింది. తన జీవితంలో తీరని అఖాతం ఏర్పడింది. అప్పుడు ... అప్పుడు రామయ్య మాంవయ్య ముందుకువచ్చి మళ్ళీ పెళ్లిచేసుకోమని పట్టు బట్టాడు. ఒక్కగాను ఒక్క కూతురు. అందులో రెండో సంబంధం ! కుటుంబయ్యకూడ వ్యతిరేకించాడు. అయినా ఆ పెళ్ళి ఆగలేదు. రాజమ్మకు, రామయ్యకు వివాహమైంది.

ఇహ, ఆ తరువాత, ... ఆ రెండు కుటుంబాలుమరింత సన్నిహిత మైనాయ్. ఏ చిన్న వ్యవహారం వచ్చినా బావా, బావమరుదులు సంప్రదించుకుంటూ వుంటారు. తన సవతి తల్లివల్లనే కొంతకాలం దూరమైనాయ్. ఆమె ఇంకో కుటుంబానికి, బయటకుపోయి చేసుకున్న సంబంధం !... ఆమె పట్టుదల వల్లనే రామయ్య బయటకు పోవలసి వచ్చినది. కాని, ఆవిడ కూడ కొద్ది కాలానికే ఆయనకు అన్యాయం చేసింది,

బాలయ్య వెళ్ళిపోయిన తరువాత రామయ్యకు ఇవన్నీ కళ్ళకు కట్టినట్లు ఒక్కొక్కటే కనపడ్డాయ్. కాలచక్రం గిర్రున తిరిగింది. ఈ యాభై యేళ్ళ జీవితం కొన్ని క్షణాలలో సినిమా రీళ్ళలా గిర్రున తిరిగింది.

"ఈ అనుబంధం వాడి కెలా తెలుస్తుంది?...ఈ బాధలు పడ్డవాణ్ణి నేను. దూరంగా కూచున్నవాడి కెలా అనుభూతికి అవుతాయ్" అనుకున్నాడు తనలో తానే గతాన్ని స్మరించు కుంటూ.

తనలోకూడ ఏదో బలహీనత వుందని గమనించాడు. ఇంతప్పటినించి, కాదు కాదు. తనకు కూతురు పుట్టినప్పటి నించి గోపీకి యిద్దామని అనుకున్నారు. తాము అనుకోవడ మేమిటి? వూళ్ళోవాళ్ళంతా అలాగే అనుకున్నారు. అలాంటిది తనుకూడ, తనభార్య రాజమ్మకుకూడ యివాళ రాముల కిద్దా మని కలగట మేమిటి చెప్మా! అనుకున్నాడు రామయ్య తనలో తానే. వెంకయ్య తన కూతుర్ని యివ్వా లనుకుంటున్నాడని విన్నదగ్గరనించి తన కెందుకనో ఆ ఆలోచన కలిగింది. ఆయన ఎందు కివ్వా లనుకుంటున్నాడూ! కుర్రాడిని చూచేగదా! తను ఆశపడటంలో తప్పేముంది? కాని, గోపీకూడ ఏం తక్కువ తిన్నాడా! మరల తానీరోజున తన అభిప్రాయాన్ని ఎందుకు మార్చుకోవాల్సి వచ్చింది. ఈడు జోడూ లేని వివాహం! రాజమ్మ జీవితాన్ని నాశనం చేసిన తను ఆమె కూతురునికూడ సుఖంగా చూడలేడా ?

"ఛీః! అలాఎన్నటికీ జరగదు. జరగటానికి వీలులేదు." అనుకున్నాడు రామయ్య "అయినా ఈ వ్యవహారం బయట

కెలా వచ్చింది. బహుశా ఆ మునసబే చేసి వుంటాడు ఈపని. వాడిదే అయివుంటుంది. నేను వాడితోనే చెప్పాను. వాడే! వాడి బుద్ధి అంత! అందరూ సుఖంగా వుండటం చూడలేడు. కలసి మెలసి వున్న వారిని చీలదీయటంలో మొనగాడు. వాడే చెప్పివుంటాడు. ముమ్మాటికి వాడే!"

మరల ఆయన మనస్సు కాసేపటి కెందుకనో విద్రోహం లేవదీసింది. ఈ రోజుల్లో చదువుకున్న వానికిగల గౌరవం చదువులేనివానికి లేదు. పాతకాలం, పాత ఆచారాలు పోతున్నట్టి కొత్త కాలమానంకూడ వచ్చింది. గోపీ చదువుతాడనే నమ్మకం లేదు. అందువల్ల రామారావుకే యిచ్చిచేస్తే... అని అనుకున్నాడు తనలో తానే...

ఆ మరుక్షణంలోనే తన నీడను చూచి తానే భయపడుతున్నట్టు కంగారుపడ్డాడు. తనకు వృద్ధాప్యం వచ్చింది. వంట్లో ఓపిక లేదు. ప్రాణం ఎప్పుడు పోయినా పోవచ్చు! కనుక ఉన్న ఒక్క బిడ్డను ఓ యింటిదానినిచేసి అది చూచుకొని చచ్చినా తృప్తిగా పోవచ్చుగదా!

కనుక, ఈ పెళ్ళితోపాటే గోపీకికూడ పెళ్లి చేసేయమని చెబుతామని నిర్ణయించుకున్నాడు. ఆకాశంవంక చూస్తూ— మినుకు మినుకు మంటున్న నక్షత్రాలుకూడ అదే చెప్పినట్టున్నాయ్.

# 12

వెంకయ్య చీకట్లోనే లేచి చుట్ట చుట్టుకుంటూంటే ఎవరో కేకేసారు లేచి వెళ్ళి బజారు తలుపు తీసాడు-సూరయ్య బాబాయి !

"ఏఁమిటి, బాబాయి! ఇంత పొద్దుకాడ లేచావు? రా ! లోపలకి" అంటూ వెనక్కి తిరిగాడు! సూరయ్యకూడ ఆయ నను అనుసరించాడు.

"ఈ చుట్ట తీసుకో! మంచి పుగాకు! వెంకటాపురంనించే తెప్పించా" అంటూ తాను చుట్టుకున్న చుట్టను ఆయనకు అందించాడు. కూచుంటె పనికాదు. రా, బయఁటికి వెళదాం!" అన్నాడు సూరయ్య నిప్పుల్లగీస్తూ వెంకయ్యకూడ ఆయనను అనుసరించాడు. కాని, ఎక్కడికి వెళుతున్నారో ఆయఁనకు తెలి యదు. ఎందుకు వెళుతున్నారో ఆయనకు తెలియఁదు. పడమటి ప్రక్కకి పోతుంటే ఏదో అనుమానం కలిగి "ఈ చీకట్లో ఎక్కడికి ?"అన్నాడు నెమ్మదిగా.

"కుటుంబయ్య ఇంటిదాకా పోయివద్దాం" అన్నాడు సూరయ్య ముక్తసరిగా, అంతే, ఇంకా వివరాలేమీ చెప్పలేదు.

వెంకయ్యకూడ ఇంకేమీ మాట్లాడలేదు. ఆయన అడుగుల్లో అడుగు వేసుకుంటూ ముందుకు పోతున్నాడు. ఆయన మెదడు మాత్రం ఏమేమో ఆలోచిస్తోంది. ముందు ముందు ప్రశ్నగిడు తోంది.

ఈ కేసు వచ్చిన దగ్గరనించి తను ఈ వ్యవహారాన్ని గురించి ఏమీ మాట్లాడటంలేదు. ఎలా మాట్లాడుతాడు? అందులో తన బావమరిదేనయ్యె, ఏం మాట్లాడినా తప్పు వస్తుంది. తన అభిప్రాయం తనలోనే వుండిపోయింది. సూరయ్య బాబాయి హెచ్చరించినప్పుడుకూడ తనేమీ మాట్లాడలేదు. కాని, ఊళ్లో వాళ్ళంతా నానా రకాలుగా చెప్పుకొంటున్నారు. వెంకయ్య కుటుంబయ్య కొడుకు రామారావుకి తన కూతుర్ని యివ్వాలనుకుంటున్నాడని. అందరూ అనుకునే వాళ్ళేగానీ, తన దగ్గరకొచ్చి అడగనూ లేదు. తను ఎవరితోనూ తన అభిప్రాయాన్ని చెప్పనూలేదు. అకస్మాత్తుగా ఇవాళ తననుకుటుంబయ్య దగ్గరకు ఎందుకు తీసుకుపోతున్నాడా?... పోనీ రాజీ వ్యవహారం కోసమా? కాదు, కాదు అది షావుకారి మధ్యవర్తిత్వంలో ఓ కొసకు చేరుకుంది. ఆయన మధ్యవర్తిత్వానికి ఇద్దరూ ఒప్పుకో వడమూ, ఆయన ముందు కేసు ఎత్తేసుకు రంకని చెప్పటమూ, దానికేం చేయాలో ప్లీడరుతో మాట్లాడటం అన్నీ జరిగిపో యాయి. ఇప్పుడు దానిని గురించి ఆలోచించాల్సిన అవసరం లేదు. మరింకెందుకు ఈయన ఇప్పుడు తీసుకుపోతున్నాడు?...

"ఇద్దరూ ఒహచోట కూచొని మాట్లాడుకుంటె సరిపో తుంది. ఈ ముసుగులో గుద్దులాట దేనికి?" అంటూ

సూరయ్య సందు 'మలుపుకి తిరిగాడు. దూరంగా ఎవరో మాట్లాడుకుంటున్నట్టు గమనించాడు.

"ఎవరు ఆ మాట్లాడేవారు?" అన్నాడు నెమ్మదిగా వెంకయ్య ఒక్కక్షణం ఆగి— "నేను ఇక్కడే ఉంటా. నీవు వెళ్ళిరారాదూ?"

"వద్దు! రా! చల్లకొచ్చి ముంతదాయటం బావుండదు. ఇందులో మనకొచ్చే నామోషీ ఏమీ లేదు. కావలసిన వారి దగ్గరా ఉన్నారు. కాబట్టి వ్యవహారం తేలిపోతుంది?" అన్నాడు సూరయ్య.

కుటుంబయ్య ఏమీ మాట్లాడలేదు. ఆయన అడుగుల్లో అడుగు వేసుకుంటూ ముందుకు పోతున్నాడు.

కొంచెం నాలుగడుగులు వేసిన తరువాత— "ఎవరారు?" అన్నాడు సూరయ్య అంతదూరంనుండే.

"నేనే కుటుంబయ్యని!"— అన్నాడు కుటుంబయ్య. కుటుంబయ్య సూరయ్యని గుర్తించాడు.

"రావే బాబాయి." అన్నాడు రామయ్య— "ఆ రెండో మనిషి వెంకయ్యనుకుంటా! రా! వెంకయ్యా!"

సూరయ్య, వెంకయ్య చతికిల బడబోతుంటే— లోపలికి వెళితే బావుంటుంది. రండి, లోపలికి వెళదాం!" అంటూ లేప బోయాడు.

"వద్దు! వద్దు! కూచో!" అంటూ వారించాడు సూరయ్య.

వెంకయ్యకిదంతా అయోమయంగా వుంది. రాత్రంతా తనకు ఎంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. మనస్సు ఎందుకనో అధైర్యంగా ఉంది. ఏమీ చేయలేని నిస్సహాయస్థితిలో ఉన్నట్టు తెలుసుకున్నాడు. అందులో ఏమో కల! ఆ కలలో... ఎక్కడో అగాధంలోకి పడిపోతున్నట్టు...ఇంతలో ఎవరో మోకు వేసి పైకి లాగినట్టు. ప్రాణంతో బయట పడినట్టు జరిగింది...అందు కనే ఎంతసేపటికి నిద్ర రాకపోయేటప్పటికి తెల్లార వస్తోందిగదా, అని చుట్ట ముట్టిద్దామనే ప్రయత్నంలో ఉండగా సూరయ్య వచ్చి పిలిచాడు...

అప్పటివరకు అనుమానం కలగలేదుగానీ, కుటుంబయ్య రామయ్య ఒకేచోట ఉండటంచూచి యెందుకనో అనుమానం కలిగింది. ఇదంతా భగవంతుని ప్రేరేపణ వల్లనే జరిగిందా అని అనుమానం కలిగింది. లేక, సూరయ్య వీళ్ళందర్నీ పోగు చేసాడా?... ఏది ఏమైనా, దీనికి భగవంతుని ఆశీర్వాదబలం వున్నట్టే వూహించుకున్నాడు...

"అబ్బాయి, ముసుగులో గుద్దులాట దేనికి? ఉన్నది ఉన్నట్టు అనుకుంటే పోతుంది. వెంకయ్య అభిప్రాయం నీకు తెలుసు కదరా, రామయ్యా. మరి ఏమంటారు?" అన్నాడు సూరయ్య— "వ్వాళ్లూ వాళ్ళేమనుకుంటారోనని ఆలోచించవద్దు మీరు, మీ మనస్సులో ఏముందో చెప్పండి. ఊరు సంగతి మీకు తెలియదు. మనం ఏంచేసినా దానికి తాళం వేస్తుంది.

ఏది చెప్పినా 'ఊఁ' కొట్టి ఊరుకుంటుంది. మనల్ని తెలుసుకోవటానికి ప్రయత్నిస్తుంది. మన మనస్సుని గ్రహించి దానికి వంతపాడుతుంది. అందువల్ల దానిని గురించి మీరు ఆలోచించకండి. మన మనస్సుల్లో ఏముంటే అదే నాల్గుచోట్ల ప్రతిధ్వనిస్తుంది. ఊళ్లోవారి స్వభావం విచిత్రమైంది. నీవు ఎంతదూరంగా ఉండటానికి ప్రయత్నిస్తావో అది అంత దగ్గరకు రావటానికి చూస్తుంది. నీవు ఎంత దగ్గరగా ఉండటానికి ప్రయత్నిస్తావో అంతదూరం పోతుంది."

ఒక్క-క్షణం ఆగిపోయాడు— "మీరు నల్గురూ ఏమనుకుంటారని భయపడవద్దు. ఇంతకంటే మహామహా విరోధులు కలసిన సంఘటన లున్నాయ్. మన విరోధాలు వాటి ముందు ఏపాటివి? కలతలు వస్తాయ్, పోతాయ్. కాని మనస్సులోని మమతలు ఎప్పటికీ ఒకేలాగే ఉంటాయ్. ఏ మంటావు రామయ్యా?" అని అడిగాడు.

"నే ననేది ఏముంది? నీ మాటకు ఎవరు కాదంటారు? నీవు ఏం చెప్పినా అందరికీ సమ్మతమే." అన్నాడు రామయ్య— "అందరికీ కావలసిన వాడివి. నీవు యేది చెప్పినా, యేం చెప్పినా అది అందరికీ మంచికోరే చెబుతావు. అంతేనంటావా, వెంకయ్యా?"

"ఆయన అందరికీ కావలసిన మనిషి. ఆయన ఏం చెప్పినా అది అందరికీ మంచినే యిస్తుంది." అన్నాడు వెంకయ్య.

కుటుంబయ్య మౌనంగా కూచున్నాడు. ఆయనకు యేం మాట్లాడాలో తెలియటంలా. అది గమనించిన సూరయ్య— "మా అల్లుడి సంగతి నాకు తెలుసు. వాడు చెప్పేమాట నేనే చెబుతున్నా— "రామారావుకి వెంకయ్య కూతుర్ని చేసుకోవటం ఖాయం'' అన్నాడు.

"అదేమిటి బాబాయి. ముందే అలా అనేస్తావ్?'' అన్నాడు రామయ్య.

సూరయ్య తెల్లమొహం వేశాడు. వెంకయ్య ఆయన వంక ఎగాదిగా చూచాడు. ఆయన మొహంలో నెత్తురుచుక్క లేదు. ఆ మాట వస్తుందని వారిద్దరూ అనుకోలేదు.

రామయ్య మళ్ళీ అన్నాడు— "లోకం మారింది బాబాయి! మనం పెద్దవాళ్ళం నల్గురమూ యిక్కడ కూచోని నిర్ణయించామంటే సరిపోతుందా? పిల్లకాయల్నికూడ అడిగి నిర్ణయించుకుంటే బావుంటుంది కదా!''

సూరయ్య ఒక్కసారి ఓ నిట్టూర్పు విడిచి — "అలా అంటావా? ఎప్పుడూ ఆ పరతుకు లోబడేగదా మనం ఏపని చేసినా. అయినా ఈ వ్యవహారంలో పిల్లలకి ఏం తెలుసు? వారికి లోకం అనుభవం తక్కువ! మనం ఈ సమస్యని ఎన్ని రకాలుగా ఎంత లోతుగా ఆలోచిస్తామో వారంతగా ఆలోచించరు. ఈ రోజుల్లో జరుగుతున్న వాటిని మనం చూస్తూనే వున్నాంగదా! కావాలని ప్రేమించుకోని చేసుకొన్న దంపతులు ఎంతమంది బాధపడటంలేదు? ఆ స్థితిగోస్తమో అంతస్తులు గమ

నించక చేసుకున్నా సుఖపడలేకపోతున్నారు. ఆ స్త్రీని కాదని ప్రేమే ప్రధానమని చేసుకున్నవారు బాధపడుతున్నారు. ఈ సిద్ధాంతాన్ని నేను ఒప్పుకోను. మనం పెద్దలమాటవిని చేసుకున్నా సుఖపడటంలేదా? అయినా రాము వ్యవహారం వేరు! వాడి ఆలోచనలు వేరు! వాడితో కూడ సంప్రదించాల్సిందే! మన మాట కాదనలేడు. ఈ మధ్య ఓ వారం రోజులనించి కనపడటంలేదు. ఎక్కడికి వెళ్ళాడు?" అన్నాడు.

"ఉద్యోగమిస్తాం, ఒకసారి రమ్మనమని బెజవాడ కాలేజీ వారు రమ్మంటె వెళ్ళాడు. ఇవాళో, రేపో రావాలి"అన్నాడు కుటుంబయ్య.

"వాళ్ళు ఒప్పుకోందే నేనుకూడ ఒప్పుకోను బలవంతపు పెళ్ళిపనికిరాదు. ఏదివచ్చినా ఓర్చుకోలేరు"అన్నాడు సూరయ్య ఒక్కసారి ఆకాశంవంక చూచి "అదుగో! ఇంకా సప్తఋషులు వున్నారు. వారి ఆశీర్వాదబలం తనకు వుంది. ఈ వివాహం తప్పక జరుగుతుంది. అందరికీ సుఖసౌఖ్యాలను తెస్తుంది. అది ముమ్మాటికీ వాస్తవం."

అంతా ఒక్కసారి తల పైకెత్తి ఆకాశంవంకచూచారు. ఆకాశం వారివంక చూచింది. చిరునవ్వుల తారలు ఒక్కసారి ముసి ముసినవ్వులు నవ్వుకున్నాయ్. ఎక్కడో 'కుక్కురుకో!' అని కోడి కూసింది.

బజారు వాకిలి ఊడవటానికని తలుపులు తీసుకున్న కామాక్షమ్మ ఎవరో మగవాళ్ళు వుండటంచూచి గబుక్కున తలుపులు వేసుకుంది.

"ఇహపోదాం" అంటూ లేచాడు సూరయ్య. ఆయనతో పాటు అందరూ లేచి నిలబడ్డారు. ఆయన "కట్నాలు కానుకల గురించి మనం అనుకునేపని ఏముంది? అది అందరికీ తెలిసిన వ్యవహారమేగా!" అన్నాడు నవ్వుతూ. అందరూ ఒక్కసారి నవ్వి వూరుకున్నారు. ఆ నవ్వులో మరొక్కసారి 'కొక్కొ-రుకో!' కోడికూత కలసిపోయింది.

"మళ్ళీ పనిరోజులు వస్తున్నాయి. త్వరలోనే లగ్నం పెట్టుకుంటె బావుంటుంది." అన్నాడు సూరయ్య.

"వాడు ఉద్యోగానికి వెళ్ళిపోతాడు. ఈ లోపలే మనం ఏదొహా నిర్ణయానికి వచ్చేద్దాం!" అన్నాడు రామయ్య.

"త్వరలోనే పెట్టుకోవాలి. లగ్నాలుకూడ లేవు"— అన్నాడు వెంకయ్య.

వెంకయ్యకు నెత్తిమీద బరువు దింపినట్టుంది—'ఇక్కడ రాసిపెట్టివుంటే నే నెన్నిచోట్లకి తిరిగితేమాత్రం ప్రయోజనం ఏముంటుంది?' అనుకున్నాడు తనలో తానే అందుకే అంటారు. 'భగవంతుడు ఏం చేసినా, మన బాగుకే చేస్తాడని' విధి లిఖితం తప్పించటం ఎవరితరమబ్బా!

# 13

ఊరంతా ఒక్కసారి విస్తుపోయింది. ఆనోటా, ఆనోటా పడి యీ వార్త ఎప్పుడు పాకిపోయిందో ఏమో తెలియదు. కాని, అందరికీ, చిన్నా పెద్దా, అందరికీ తెలిసిపోయింది నక్కలవారు; పోతుగడ్డవారు వియ్యంకు లవుతున్నారని. అది విన్నవా రందరూ విస్తుపోయారు.

మరి విస్తుపోరూ? అయిదు తరాలనించి అటుకాకి యిటు వాలలేదు, ఇటుకాకి అటు వాలలేదు. కుటుంబయ్యతాత తాత పోయినప్పటినించి గ్రామ పెత్తనం నక్కలవారి చేతిలోనించి పోతుగడ్డ వారి చేతుల్లోకి వెళ్ళిపోయింది. అనేక తరాలుగా వస్తు ఆవారసత్వాన్ని నిలుపుకోవటానికి ఆయన కోర్టులకు కూడ వెళ్లాడు. ఆస్తి పోయినా, పెత్తందారీ తనాన్ని మాత్రం నిలుపుకోవటానికి విశ్వప్రయత్నం చేశాడు.

ఇంతకీ ఏంజరిగిందేమంటె, ఆ వూళ్ళో అనాదికాలంనించి పోతరాజు జాతరచేస్తూ వుండేవారు. ఆ జాతరలో మొట్టమొదట తెగవలసింది నక్కలవారి పోతు ... కాని, ఆయేడు నెంకయ్యతాత తాత పట్టుబట్టి తన పోతుని కోయించాడు. అక్కడనించి ప్రారంభమైంది, ఈ యుద్ధం ...

ఆస్తి పోయింది. కాని, వారికి న్యాయం దక్కలేదు; అనాదిగా వస్తూన్న వారసత్వం మంట కలసిపోయింది. ఇహ ఆ పరిస్థితికి తట్టుకోలేక ఆయన బలవంతాన ప్రాణం తీసు కొన్నాడు. ఆ స్పర్థలే పెరిగి పెరిగి ఆ రెండు కుటుంబాల్ని నిలువునా కూలదీశాయ్. ఆ జాతర్లూ, ఆ పెద్దరికాలు పోయినా మనస్పర్థలుమాత్రం అలాగే వుండిపోయాయ్. అప్పటికీ— యిప్పటికీ...

కనుకనే, ఆ యింటిమీద కాకి యీ యింటిమీద వాలడానికి వీల్లేదు. ఈ యింటిమీద కాకి ఆ యింటి మీద వాలడానికి వీల్లేదు ఈ పరిస్థితుల్లో ఆ పాత కథ లన్నీ మరచి, వియ్యంకు లవుతున్నారంటే విస్తుపోయారు.

అంతేనా ... అసలు కొంతమంది నమ్మలేకపోయారు. ఏదో గిట్టనివాళ్ళు పుట్టించివుంటారు అనుకుంటున్నారు....కాని, నెమ్మదిగా అందరికీ రూఢి అయింది. కొంతమంది, బావుందంటే బావుందన్నారు, మరికొంతమంది చప్పరించి వూరుకున్నారు.

ఓనాడు మునబు ఏదో పనిమీద పడమటిప్రక్కకి వెళ్ళి అటు రామయ్య యింటి కెళ్ళాడు. పిచ్చాపాటీ మాట్లాడుకున్న తరువాత – "ఇంకెందుకే, పెళ్ళిలో పెళ్ళి చేసేయరాదూ?" అన్నాడు రామయ్యతో.

"మా అమ్మాయికి ఇప్పుడే పెళ్ళి ఏమిటయ్యా? అన్నీ పదేళ్ళు లేవు. ఇంకా నాలుగైదేళ్ళన్నా ఆగుతాం; తొందరే ముంది?" అన్నాడే కాని, ఆయన మనస్సు పీకుతోంది. తనా చివరి పడిలో పడిపోయాడు. ఏముంది? ఎప్పుడైనా రాలిపో

వచ్చు. ఈ లోపలే దానిని ఓ యింటిదానినిచేసి చూసిపో వచ్చని పీకుతున్నా, మళ్ళీ ఎందుకనో వెనకాడుతున్నాడు.

"నీవు అలాగే అంటావు. నీవా? ఎప్పుడు రాలిపో తావో తెలియదుగదా! పోయే లోపలే ఆ పిల్ల పెళ్ళి కాస్త ముగించేసేవంటి ఏ చీకూ చింతా లేకుండా హాయిగా కళ్లు మూసుకోవచ్చు" అన్నాడు మునసబు మహా అనుభవం వున్న వానిలా.

"నేను పోతే మీరంతా లేరా ఆ మూడు ముళ్లూ వేయటానికి. నేనే కావాలని ఏముంది?" అన్నాడు నవ్వుతూ రామయ్య.

"అదికాదయ్యా! గోపీ వున్నాడు చూచావు, వాడు ఇంట్లో వుంటే మనిషిలా లేడు. ఎప్పుడూ ఏదో హ రాజకీ యాలు. కాస్త ఆ మూడు ముళ్లూ వేస్తే యింట్లో పడి వుంటాడని" అని ఊరుకున్నాడు మునసబు.

"ఈ రోజుల్లో కుర్రవాళ్ళే అంత! మనకంటె దేశమంటె ఏవిటో తెలిసేదికాదు. మా నాన్నకు మీ నాన్న జమాబందీ వచ్చిందంటె గజగజ వణకిపోయేవాడు! ఇప్పుడారకం భయం లేదు. అప్పటికీ ఇప్పటికీ చాల మార్పు వచ్చింది. ఈనాటి కుర్రవాళ్ళ తీరే అంత!" అన్నాడు రామయ్య చుట్ట కాలుస్తూ.

"సరేగాని, వెంకయ్య ఏం కట్నాం యిస్తున్నాడు?... నేను వినడం పైడాబుసరేకాని, లోపల చాల బొక్క వుంద టయ్యా, బొక్కా!" అన్నాడు మునసబు జిజ్ఞాసగా!

"అలాగా! ఎవరన్నారు నీతో? నాకు తెలిసినంతవరకు నిలవలో వున్నాడనుకుంటున్నాం...నీకు ఎలా తెలిసిందో కాని, అలాంటిదేమీ లేదయ్యా ఏం ఖర్చువుంది మనిషికి? ఏటా ఎట్లా లేదన్నా నాలుగువేలు మిగులుతాయి. పోనీ సగం ఖర్చులకు పోయినా సగం నిల్వ వుండాల్సిందే! ... అది కూడ లేదే అనుకో! అప్పు ఎలా వుంటుదయ్యా? నేను నమ్మను! నేనే కాదు, ఎవ్వరూ నమ్మరు."

"పెద్దవాళ్ళ వ్యవహారం నీకు తెలియదయ్యా? కుండ పగిలేవరకు నిండుగానే వుండట్టు కనవడుతుంది. నాకు చెప్పినప్పుడు నేనూ నీలాగే నమ్మలేకపోయాను. కాని, తరువాత నమ్మక చేసేదేముంది? అందుకే, ఎందుకైనా మంచిది. ఆ రెండు ముక్కలు కూడ ఖండితంగా తేల్చుకుంటె" అన్నాడు నెమ్మదిగా సలహా యిస్తున్న ధోరణిలో, ఎవరైనా వినిపోతారేమోనని నెమ్మదిగా.

"అలా అయితే, ఆ విషయం తేల్చుకుందాం? దాంట్లో తప్పేముంది?" అన్నాడు రామయ్య ఇహ వ్యవహారం పెంచటానికి యిష్టంలేక. ఒప్పుకోకపోతే ఎంతవరకు వదిలి పెట్టడని రామయ్యకు తెలుసు.

ఆ తరువాత రెండు మూడు రోజులకి వెంకయ్య కెలా తెలిసిందో తెలిసింది. వారికి కట్నాలసంగతి తేల్చుకోవాల్సి వుందని. దాంతో అగ్గి బుగ్గయిపోయాడు. 'వాళ్ళు నన్ను

కట్నం అడుగుతారా?' అని ఆయన శివమెత్తాడు. అక్కడక్కడా ఒకాటీ రెండుమాటలుకూడ జారవిడిచాడు కూడాను.

అసలు ఈ కట్నాం కానుకల సంగతి పట్టించుకోని కుటుంబయ్య చెవిలో వెంకయ్య అన్నమాటలు పడ్డాయ్. 'ఆడపిల్ల తండ్రికే అంతవుంటె తన కొడుకు కండనూడను' అనుకున్నాడు తనలో తానే ఆ సాయంత్రమే సూరయ్య యింటి కెళ్ళాడు.

వాళ్ళదగ్గర వాళ్ళదగ్గర జరిగిన మాటలు సూరయ్యకు తెలియకపోలేదు. నానా చీవాట్లు పెట్టి కుటుంబయ్యను ఇంటికి పంపాడు. 'ఇంకా పెళ్ళి పదిహేను రోజులుంది. ఈ లోపల మీ మనసుల్ని చెడగొడతారు.' నేను అనుకుంటూనేవున్నాను. అనుకున్నంత అయింది' అన్నాడు సూరయ్య. "అందుకే ఇలాంటి వ్యవహారాలలో ఆలస్యం అమృతం విషం' అన్నారు మనపెద్దలు" అన్నాడు సూరయ్య.

కుటుంబయ్య ఏమీ మాట్లాడలేదు.

"అబ్బాయి వచ్చాడు? వాడి సలహాకూడ తీసుకొని త్వరగా కార్యక్రమం జరిగిస్తే పోతుంది" అన్నాడు మళ్ళీ ఆయన.

"బెజవాడ కాలేజీలో ఉద్యోగం వచ్చేట్టువుంది. త్వరలోనే ఆర్డర్లు పంపిస్తాం. వచ్చి చేరమన్నారట!" అన్నాడు కుటుంబయ్య.

"ఇంకేం వాడి కోర్కె నెరవేరుతుంది. నేను ఎప్పుడు కదలించినా ఈమాటే చెప్పాడు. ఉద్యోగంలో చేరందే పెళ్ళి చేసుకోనని. ఆ అడ్డంకు కాస్తా తొలగిపోయింది. ఇహ ఏబాధా

లేదు. నేను అందుకే ఏమంటాడోనని భయపడుతున్నాను" అంటూ, పరమానందభరితుడయ్యాడు.

ఇంతలో బయటనించి ఎవరో "సూరయ్యగారూ! సూరయ్యగారూ!" అని కేకలేసారు. 'ఎవరు?' అంటూ బయట కొచ్చాడు.

వెంకయ్య పాలేరు సాంబడు—"మా దొరగారు ఉన్నారేమో చూచి రమ్మన్నారండీ" అన్నాడు.

"నేనే వస్తున్నాలే అటు. నీవు పద" అన్నాడు వెనక్కు తిరిగి.

"సరే నేను పోయివస్తా!" అంటూ లేచి నిలబడ్డాడు కుటుంబయ్య.

"అక్కడా అక్కడా జరిగిన మాటలకి మీ హృదయాల్ని కలుషితం చేసుకోకండి. నీకేదైనా సందేహం వస్తే నన్నడుగు! అంతే!...ఇన్నాళ్ళకి ఏకమవుతున్న మీ కుటుంబాల్ని మరొక్కసారి చీలదీయటానికి ప్రయత్నిస్తారు. వారు చెప్పే మాటలు చెవిని పెట్టకు" అన్నాడు సూరయ్య "సరే! వెళ్ళిరా! నేను వచ్చి బాబుని కలుసుకొని మాట్లాడతా."

"వస్తా, మావాఁ!" అంటూ బయలుదేరాడు కుటుంబయ్య.

# 14

కుటుంబయ్య యింట్లో అడుగు పెట్టగానే— "అత్తయ్య కబురుచేసింది, నాన్నా!" అని చెప్పింది సరోజిని— "త్వరగా రమ్మందట!"

ఆయన వెంటనే వెనక్కి తిరిగాడు.

"పోనీ, భోంచేసి వెళ్ళరాదూ?" అంది భార్య లక్ష్మమ్మ. "ప్రొద్దున ఎప్పుడో తిన్నారు."

"ఇప్పుడే వచ్చేస్తా, ఏమిటో తెలుసుకొని." అన్నాడు కుటుంబయ్య. "నీవు ఈ లోపల నీళ్ళుతోడు. స్నానం చేయాలి. ఒళ్ళు కంపరంగా ఉంది."

"అబ్బో. నాకు తెలియదా? అన్నాచెల్లెళ్ళ ఆలోచన ఈ పూటకి తెగితే నయమే." అందామె.

వాస్తవానికి అంతే జరిగింది. వెంటనే తిరిగి వద్దామనుకొన్న కుటుంబయ్యకూడ భోజనం సంగతి మరిచే పోయాడు. . .

కష్టాలు వస్తే ఒక్కటే రాదంటారు. కష్టాలే కాదు. ఈ ప్రపంచంలో ఏది వచ్చినా శరపరంపరగానే వస్తాయ్. అందు

కనే దీనిని ప్రపంచ మన్నారేమో! ఓ ప్రక్క రామారావు వివాహంతోనే సతమతమవుతున్న కుటుంబయ్యకు యిప్పుడు మరో సమస్య వచ్చింది. రాజమ్మ చిన్నవాడి పెళ్ళికూడ చేసేయ్యాలని పట్టుపట్టింది. ఆ మాట వినటంతోనే ఆయన నిలువునా కుంగిపోయాడు. ఏంచెప్పాలో తెలియక సతమతమయ్యాడు. ముచ్చెమటలు పోసాయ్. ముళ్ళమీద కూచున్నట్టుంది ఛీ ఈ సమస్యలేమీ లేకుంటే యెంత బావుంటుంది అనుకున్నాడు ఆయన తనలో తానే.

ఇంకొకళ్లెవ్వరైనా అయివున్నట్టయితే నిర్మోహమాటంగా చెప్పి ఉండేవాడే. కాని, రాజమ్మ ఆయన చెల్లెలు. జీవితమంటే ఏమిటో తెలియని అభాగ్యురాలు. ఈడూ జోడూ కాని వివాహం చేసుకొని బరువుగా భారంగా జీవితాన్ని యీడ్చుతున్న మూగజీవి. ఆమె కోర్కెను ఎలా కాదనాలో, ఏం చెప్పాలో తెలియక అలాగే చతికిలబడిపోయాడు.

కాసేపటికి ఎలా అయితే నేం, తేరుకొని— "పోనీ నీ కలాంటి అభిప్రాయముంటే అలాగేచేద్దాం. దీనికింతఆలోచన యెందుకు?" అన్నాడు నవ్వుతూన్న మొహంతో.

"నా అభిప్రాయం కాదు. మీ బావ అభిప్రాయం. కన్నందుకు ఆ మూడు ముళ్లూ చూచి పోదామని ఉందంటున్నారు." అందామె దీనంగా.

ఈ మాట విన్న కుటుంబయ్య మరింత కుంగిపోయాడు. ధైర్యం చిక్కబట్టుకొని ఏమేమో చెబుదామనుకుంటున్న

ఆయనకు ఈ మాటవిని నడుం విరిగినట్టయింది. ఏమి చెప్పాలో తెలియక— యింత చిన్నవయస్సులో పెళ్లేమిటి అమ్మాయి! మీా పిచ్చిగానీ." అన్నాడు. "ఆయనకు మతిపోతోందంటే నీకు కూడ మతి పోతోందా?"

"ఆయన కోరుకునే దాంట్లో నాకు బేసబబేమీా కనిపించ డం లేదు. ఆయన కోరుకునేది కనీస కోర్కె. అదికూడ తీర్చ టానికి వీల్లేదంటా?" అనడిందామె.

"ఏదో పిచ్చి పిచ్చి భయాలు పెట్టుకొని మనసుల్ని చెడగొట్టు కుంటున్నారు. వాళ్ళ భవిష్యత్తుకి ఇది మంచిది కాదు. యిప్పుడే పెళ్ళిచేస్తే వాడి చదువు పోతుంది. ఇంకా... ఇంకా." అని ఆగిపోయాడు. ఆ తరువాత యేం చెప్పాలో, ఎలా చెప్పాలో ఆయనకు అర్థంకాలేదు.

"చదువు లేకపోతే యిప్పుడొచ్చిన ఇబ్బందేం లేదు. తింటానికి లోటు ఉండదు కదా." అందామె.

"ఈ రోజుల్లో చదువు లేకపోతే యింకేముందమ్మా. ఈ ఆస్తులు యినాళ్ళ ఉంటాయ్. రేపు పోతాయ్. కాని, చదువు యెక్కడికి పోతుంది? అదెప్పుడూ నీడవలె మనకుతోడు ఉంటుంది దైవంవలె సదా కాపాడుతుంది. దానిని వద్దనుకో కూడదమ్మా!" అన్నాడు కుటుంబయ్య "ఈ రోజుల్లో చదువు కోగల స్తోమతు లేక కొందరు నానా పాట్లు పడుతూ ఉంటే, మనలాంటి వాళ్ళు మరికొందరు ఇలా అనుకుంటున్నారు. అది మంచిపని కాదు."

"నిన్న కాదని నే చెప్పేదేముంది. ఆయన అభిప్రాయం అలా ఉంది." అంటూనే కళ్ళవెంట నీరు పెట్టుకుంది.

ఇంతలో "అత్తా! అత్తా! అంటూ రామారావు వచ్చాడు ఆమె గబగబా చెంగుతో కళ్లు తుడుచుకొని "రా బాబు!" అంటూ మంచం వాల్చింది.

"సరే! నే వెళ్లివస్తా! నీళ్ళు తోడమని వచ్చా. ఆరి పోయుంటాయ్." అంటూ లేచి నిలబడ్డాడు. "బాబు" అందుకే వచ్చి ఉంటాడు."

"యింకా భోంచేయనే లేదా. నేను భోంచేసి వచ్చావేమో ననుకున్నాను." అందామె. రామారావు నుద్దేశించి "కూచో బాబు. నీవైనా భోంచేసావా?" అనడిగింది.

"మా అందరివి అయిపోయాయ్. నాన్నా, అమ్మా ఉన్నారు." అన్నాడు రామారావు.

"అయ్యో! నా తెలివి తెల్లార. నేను మరచేపోయా. సుశీల బావుందంటే కాస్త కూర పంపిద్దా మనుకున్నాను" అందామె.

"సరే. నేను వస్తాను, అమ్మాయి." అంటూ నెమ్మదిగా బరువుగా అడుగులేసుకుంటూ బయట కెళ్ళిపోయాడు.

"మామయ్య వస్తారు కూచో బాబు" అంటూ ఆమె మంచంమీద పక్క వేసింది. "ఆ చేతిలోదేమిటి బాబు?"

"నిన్న బెజవాడ వెళ్ళా కదూ? వస్తూ వస్తూ యేమీ కనపడకపోతే ఈ బొమ్మ తెచ్చా. చూడు యెలా ఉందో." అంటూ పెట్టెలోనించి ఆటబొమ్మ తీసాడు రామారావు— "ఏదీ సుశీల?"

"వాళ్ళ బాబాయి గారింటికి వెళ్ళినట్టుంది" అంటూ కారే కన్నీటిని పమిటచెంగుతో తుడుచుకుంది. రామారావు ఎక్కడ చూస్తాడోనని, అయినా రెండు బొట్లు ఆమె పెదవి మీదగా రాలి భూమిలో యింకిపోవటం రామారావు చూడక పోలేదు.

## 15

జీవిత ప్రవాహం చాల విచిత్రమైనది. ఎప్పుడు ఎటు మల్లుతుందో తెలియదు. పర్వతాలలో పుట్టి, అనంత వేగంతో ప్రవహిస్తూ, కొండలను ఢీకొంటూ, ఒక్కొక్కప్పుడు భీకర గర్జనలు చేస్తూ, మరొకప్పుడు ఆనందంతో కూనిరాగాలు తీస్తూ మరపిస్తూ మురిపిస్తూ ప్రవహించేప్రవాహంలాంటిది! ఆప్రవాహం

గమనం ఎటో ఎంతవరకో తెలుసుకోవడం కష్టం. అయినా, ఆ ప్రవాహంలో అందమూ వుంది. ఆనందమూ వుంది. అందుకే జీవితంలో గల అందం ఆనందం అవి ఎదుర్కొనే సమస్యల్లో వున్నాయ్. వాటి పరిష్కారంలో కాదు. కనుకనే సమస్యల్లోవున్న ఆకర్షణ వాటి పరిష్కారంలో లేదు. ఎన్నో సమస్యలెన్నెదుర్కొంటూ ముందుకు పయనిస్తున్న జీవితంలో ఆ ఆకర్షణ లేకపోతే ఎప్పుడో యీ ప్రపంచం తన అవతారాన్ని చాలించుకునేది! కాని, అలాంటి నిరాశ, నిస్పృహ కనిపించదు. నిండు ఉత్సాహంలో ముందుకు పయనిస్తున్న యీ మానవ పురోగమనం ఎంతవరకో తెలియదుగదా!

కుటుంబయ్య ఒక్కసారి వెనక్కు తిరిగి చూచుకున్నాడు! ఆయన స్మృతిపథంలో ఒక్కసారి కాలచక్రం గిర్రునతిరిగింది! జీవితంలో ఎంతమార్పు! తన చిన్నతనంలో ఏదీ సమస్యగా కనిపించలేదు. దేనిని గురించీ ఆయన బుర్ర పగులగొట్టుకోలేదు. ముందు ఏం జరుగుతుందో ఆలోచించలేదు. అయినా అన్నీ సక్రమంగా, సవ్యంగా జరిగిపోయాయ్. ఆలోచించనందువల్ల ఏ లోటుపాట్లూ కనిపించలేదు. తాఫీగా నిర్మలంగా జరిగి పోయింది.

కాని, ఇప్పుడు ప్రతీదీ ఒహ సమస్య! ఆ సమస్యా పరిష్కార ప్రయత్నంలో మరిన్ని సమస్యలు తలఎత్తడం! నదీ ప్రవాహానికైనా కట్టలు నిర్మించగలిగాం కాని జీవితానికి ఏ అడ్డూ ఆటంకమూ లేదు. అది ఎప్పుడు ముందుకు ప్రవహిస్తోందో, మరెప్పుడు వెనక్కు మళ్లుతుందో తెలియదు!

ఒక్కొక్కప్పుడు వాని భీకర గర్జనలనే ఆనంద సవ్వడిగా భావిస్తాం. మరొకప్పుడు అనురాగ రాగాలను అందుకోలేక భీకరంగా భావిస్తాం...

కుటుంబయ్య ఇవన్నీ ఆలోచించుకుంటూ అన్నంపళ్ళెం ముందు కూచున్నాడే కాని ఆయన మనస్సులో మనస్సు లేదు. ఆ విషయం గమనించిన లక్ష్మమ్మ లోపల్నుండే! అట్లా వున్నారు?" అనడిగింది నెమ్మదిగా.

ఆయన అది వినిపించుకున్నట్టే లేదు! తన ధోరణిలో తానే—"చిన్నబ్బాయి ఎక్కడికెళ్లాడు?" అనడిగాడు.

"ఇప్పుడే అన్నంతిని, ఆటకెళ్లినట్టున్నాడు!"— అంది లక్ష్మమ్మ—"ఏమిటి! మీరు అలా వున్నారు? మీ చెల్లెలు ఏమంటేవిటి?"

"ఇప్పుడే రెండోవాడికి పెళ్లి చేద్దామంటున్నారు! పోనీ..."

ఆయనను మధ్యలోనే ఆపి—"అదేవిటండీ నిండు పదహా రేళ్లు లేవు! వాడికి పెళ్లేమిటి? వాళ్ళకేదో పిచ్చిపట్టిందని మీకు కూడ మతిపోయిందా? అందులో వాడు చేసుకోకనే!...మనం వాడితో అన్నా వాళ్ళుమవటం, వాడు మనమాట కాదన్నా డవడం—అంతేగాని, పని జరిగేది వుండదు!" అందామె.

"వాళ్ళు అంటున్నా రన్నాగానీ, నాకు చేద్దామని వుందన్నానా? ఏమిటో వాళ్ళభ్రమ!" అని ఓ నిట్టూర్పు విడి

చాడు! ఇదివరకటికీ, ఇప్పటికీ ఎంత తారతమ్యం వచ్చిందీ? తన వివాహం పదిహేనోయేట జరిగింది! అందుకు అతడేమీ భయపడలేదు! ఏదో జరుగుతున్నట్టు "ఊహించుకోలేదు. అయినా, తన జీవితం సాఫీగా జరిగిపోలేదా?...

"మొన్న మీరూ వెంకయ్యగారూ ఏవిటో మాట్లాడు కుంటున్నారటగా! ఏమిటో చెప్పారుకాదూ?" అనడిగింది లక్ష్మమ్మ!

"ఎవరన్నారు?"

"కామాక్షమ్మ అంటోంది!"

ఎవరినుండైనా కాపాడుకోగలం కానీ యీ ఆడవాళ్ళ నుండి కాపాడుకోవడం చాల కష్టమనుకున్నాడు కుటుంబయ్య.

ఈ రెండురోజులనించి జరిగినది చెబుదామని ఎంత ప్రయత్నించినా, తీరా ఆ క్షణంలో ఏదో అడ్డుతగలటంవల్ల ఆగిపోయేవాడు!

"అందుకేగా! వూళ్లోవాళ్ళందరూ నా స్వలాభంకోసం రాజీకి తొందరపడ్డానని నానా రకాలుగా అనుకుంటున్నారు?... నాకుమాత్రం అలా కనిపించటంలేదు. ఏదోశక్తి ముందుకు నెట్టుతున్నట్టు కనపడుతోంది. నేనేం చేయను?...పోనీ, ఏదో ఒహారకంగా ఆ వ్యవహారమంతా పరిష్కారమయిందనుకుంటె మళ్ళీ యీ వ్యవహారం?"— అన్నారాయన చికాకుగా.

"ఈ లోకంతీరే అంత! మనం మనదారిని పోతుంటె పోనీయదు. ముందుకు పోతుంటె వెనక్కు లాగుతుంది! దాని

కోసం మన పనులు మనం మానుకొంటామా? ఏదోవిధంగా మన మార్గాన్ని మనం పోవాలి!" అందామె ధైర్యం చెబుతూ.

"బాబు అభిప్రాయం తెలుసుకోమన్నానుగా ఏమంటున్నాడు?"—

"వాడేం అంటాడు. విన్నాడు. విని మౌనంగా వూరుకున్నాడు. ఏమీ మాట్లాడలేదు. పైగా నాకంటెముందే సూరయ్యబాబాయి చెప్పాడంట!"

"ఈరోజుల్లో అలాకాదే? మీరూఅంతే!"— అందామె. ఆమెకు చిన్నతనపు చిలిపిచేష్టలు గుర్తొచ్చాయ్.

కుటుంబయ్య నవ్వివూరుకున్నాడు—"వెంకయ్యకూతుర్ని ఈమధ్య ఎప్పుడైనా చూచావా?" అని అడిగాడు.

"చూడకేం! మన సుశీలలాగా వుంటుంది. అంతా అదే మొహం! అదే ఆకారం!" అందామె.

"అయితే నీవు చాలఅదృష్టవంతురాలవుసుమీ! ఆడాళ్లిద్దరూ ఒకే పోలికన అంతంత మాత్రాన ఒకటిగాఉండరు ఎంతో అదృష్టంవుంటె తప్ప!"—అన్నాడాయన.

"పోదురూ మీరు మరీను!"·అంటూ లక్ష్మమ్మ అక్కడనించి వెళ్ళింది.

"తస్సాదీయ! నీవెప్పుడూ యింతే!" అనుకున్నాడు కుటుంబయ్య తనలోతానే.

# 16

కాలగర్భంలో మరికొన్ని దినాలు దాక్కున్నాయ్. సూర్యుడు ఉదయిస్తున్నాడు. అస్తమిస్తున్నాడు. జీవితం నిన్నే నేడుగా, నేడే రేపుగా గాటినిపడ్డ బండిలా ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా గడచిపోతోంది! ఈమధ్య ఎన్నో సంఘటనలు జరిగిపోయాయ్. రామారావుకి బెజవాడలో లెక్చరర్ ఉద్యోగం రావడం, వివాహం జరిగిపోవడం_అంతా విధి ప్రేరేపన వలన జరిగినట్లు ఒకదానివెంట ఒకటి జరిగిపోయాయ్.

ఓరోజున సూరయ్య—నీ పంతమే నెగ్గింది, బాబు! ఉద్యోగంలో చేరేవరకు వివాహం చేసుకోనన్నావు. అలాగేజరిగింది!" అన్నాడు రామారావుతో.

"నేనంటే సరిపోతుందా? మీ అందరి ఆశీర్వాదబలం అలాంటిది! నన్నేం చేయమన్నావు?"_ అన్నాడు రామారావు.

"మనమెవరం నాయనా! ఆశీర్వదించటానికి! మనందరిపైన మరింకేదో వుంది. ఆశక్తే మనల్ని ఆడిస్తోంది! అది తెలుసుకుంటే అన్నీ తెలిసిపోతాయ్"_ అన్నాడు సూరయ్య.

"ఏదో వుందంటావుగానీ, అదంతా మనలోనే, మన మనస్సులోనే వుంది తాతా! దానికే మరో పేరుపెట్టి పిల్వడం అలవాటయిపోయింది. అంతకంటె మరేమీలేదు"- అన్నాడు రామారావు.

"ఏది ఏమైనా, కొన్నాళ్లపాటు ఏ తగాయిదాలూ లేకుండా చేశావు. ఇహ హాయిగా బ్రతుకుదాం!"- అన్నాడు సూరయ్య ఓ నిట్టూర్పు విడుస్తూ.

"అందులో నా గొప్పదనం ఏముంది?"

"నీ పేరుమీదుగా అందరూ ఏకమయ్యారు. నిజంగా నమ్మొ నమ్మకపో! నే నెరిగివుండగా ఏపెళ్ళి యింత ముచ్చటగా జరకలేదంటె నమ్ము! నీ పెళ్ళికే ఊరంతా ఒహచోట చేరుకున్నారు." అన్నాడు సూరయ్య- "నీవు ఎప్పుడు వెళుతున్నావ్?"

"రేపు సాయంత్రమే వెళుతున్నాను, తాతా! నీవు ఎప్పుడు వస్తావు?"- అడిగాడు రామారావు.

"నే నిప్పుడే ఎలావస్తాను, బాబూ! ఇప్పుడేవస్తే నాకు జత ఎవరుంటారు?"- అంటూ చిన్నగా నవ్వాడు సూరయ్య.

రామారావుకూడ నవ్వి వూరుకున్నాడు- "పోనీలే! నీ యిష్టమొచ్చినప్పుడే రా!" అంటూ.

"పట్నంలో కెళ్ళావని పల్లెటూరిని మరిచిపోకు! స్వగ్రామం తల్లివంటిదిబాబు!" అన్నాడు సూరయ్య.

"అది ఎప్పటికీ జరగదు తాతా! మిమ్మల్ని ఎలా మరచి పోతా?"- అన్నాడు రామారావు.

"నేను అలాగే అనుకుంటున్నా బాబు? చూడు! ఎవరడిగినా, ముందు మీఊరు ఏవూరండీ, అంటారు. నీపేరు వూరికే గౌరవాన్ని తెస్తుంది."- అన్నాడు సూరయ్య.

రామారావు నవ్వి ఊరుకున్నాడు. ఏంచేయాలో, ఏంచెప్పాలో కూడ తెలియలా.

ఆ మర్నాడు రామారావుని సాగనంపుతూ వెంకయ్య- "చేతిలోసంచి నాకు యివ్వు! రెండూ ఎక్కడ మోస్తావ్?" అన్నాడు.

"ఫర్వాలేదు! ఏమంత బరువులేదు లేండి!" అన్నాడు. అలా అంటూవుంటె అతనికి స్మృతి పథంలో గతమంతా గిర్రున తిరిగింది. సరిగ్గా ఇదే జవాబు అప్పుడుకూడా యిచ్చాడు!

"ఆరోగ్యం జాగ్రత్తగా చూచుకో!"- అన్నాడు వెంకయ్య- "ఏసుగాడు పెట్టెతీసుకొని అప్పుడే రోడ్డుదగ్గరకెళ్ళి పోయినట్టున్నాడు!"

"అవును. వాడు చాల దూర మెళ్ళిపోయాడు" అన్నాడు రామారావు.

"వెళ్ళగానే ఉత్తరం వ్రాస్తావుగా!" అన్నాడు వెంకయ్య.

"వ్రాస్తా!" అన్నాడు రామారావు.

"ఇదుగో! ఈ డబ్బు తీసుకో!" అన్నాడు వెంకయ్య" జీతం వచ్చేవరకు వాడుకోవడానికి కావద్దూ?"

రామారావుకి విచిత్ర అనుభూతి కలిగింది, ఈ అనుబంధాలు ఏమిటో అతనికి బోధపడలేదు. చిత్ర విచిత్రమైన ఆలోచనల్లో కొట్టుకుపోతూ, కారెక్కిన రామారావు "మా దొరసానమ్మగారికి ఉత్తరం వ్రాసే టప్పుడు నాకు కూడా వ్రాయండి!" అంటూన్న ఏసుపాదం మాటలు విని ఒక్కసారి నవ్వి బరువుగా భారంగా నిట్టూర్చాడు.

కారు అప్పటికే భయిన గాలిలోకి దూసుకుపోయింది !



సమాప్తం.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA129B169 |
| పుస్తకం పేరు | రాగద్వేషాలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 93 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 4 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Navya |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Hasleema |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |